# ఆగడపలు.

(కవి)

కవికొండల వేంకటరావు బి. ఎ., బి. ఎల్.



శ్రీ [illegible] గ్రంథాలయము వారు,
తేలప్రోలు.

అభినవాంధ్ర కార్యస్థాన సుప్రకాశితము.

మొదటికూర్పు

సీతారామా ముద్రాక్షరశాలా ముద్రితము.

1929



కవిధ శిక్షక. ౨ ] [ వెల రు 0—12—0.

# 1 నాదు జన్మభూమి.

నాదు జన్మభూమి యే దివ్యలోకమో!
కొలను కొండకనుమ పొలము నెలసి,
యూహాలుప్పతిల్ల నుత్సాహ మెసగించి,
మేళవింపఁ జేయు మేలుపల్కు.
ఈస్థలానఁ బొలుచు నెటులేని తెమ్మెఱ:
యేను సెలవులందు నేగుదెంచ,
హృదయసీమ పొంగి, యూఱక సంభ్రమం
బెలయుచుండుఁ బాట చెలఁగుచుండు.
అకట! పాడఁజాల! అందందు నుసురంచు,
సెలవు లెన్నొలేవు చెల్లెదునని,
గడుపనగునదేమొ కడువడి సూర్యుండు
చందురుండు దిక్కుచవలఁ దిరుగ?
ఏను దీని విడిచి యెందేని పోవుచో
నెల్లగోలుపడగఁ జెల్లునదియె?
కాదు కా దిటెంత ఘనత నెడఁదనాటు
దీని మఱువనేర నే నిమిషము. *
తేలి, వేఁగు వీచుగాలిఁ దెరలియాడి పచ్చనౌ
"బీల" గడ్డి మేలిముసుఁగు వేసికొంచుఁ జిరునవ్వున్

లీల నవ్వ నదిగ తమ్మి; నెత్తముపయి నుదయమౌ
బాలభాను కరములు వెయి వలచిపెట్టు కితకితన్.
పిల్లవెన్ను తోంగిచూచు పెద్దచేను గట్టునే
చల్లనిలుచు తాడిమట్టఁ జక్క నంటఁ గుట్టి తా
నుల్లసిల్లుచున్న దొక్క యుదిరిపిచుక, గూటినే
మెల్లమెల్లగాలి వీవ మేన నెక్క లెత్తుచున్.
మలను గోసను బెద్దచింత మార్మిగట్టి, వింతగా
నిలను నిలుచు నాకుఁ దోఁచు నిసువుకంటఁ బొట్టిదై;
తలఁపుఁ గొలఁది గొండనెక్కి తరువునెక్కి చూతునా
యలఁతిఁ దోఁచుఁ బెద్దపుడమి యాస నల్లపూసయై. *

## 2 సింగు.

ముసలిది మాముసల్దియని ముచ్చటముంగిట "సింగు" గుల్క నీ
ముసలిదిమెట్టిదో కతను బూర్తిగఁ జెప్పుము టంటిఁ జెప్ప డే
వెసఁదనపాటపాడు; నిరుపేద యతం డని కొంత్రకాసా యే
వసన మొయిగి సేయఁబ్రితివానినిజూచుచు "రామురామ" నున్.
విసువక కూరుచుండి తన వేడుక నర్థము లేనిదైన, రా
జసరసపుష్టియుక్తముగఁ జక్కనియొక్క చిరంతనాఖ్యానా
ట్యసమతనాడుచుండు, నొకయప్పుడు దర్పము దప్పనీఁడు, సం
తసపడుచూఁతకే తిరుగుఁ దన్ ముదిమీసము దెల్లబాఱినన్
బసచెడనట్టి వేసమునఁ బాగను జోడును గట్టినూనెడిన్. *

ఏయదియెటో ముసల్ది యెచటేనియు నున్నదో లేదో? సింగుకున్
జేయును వంట, భోజనము సెప్పక పెట్టును, జిన్నిపిల్లలన్
బాయక పెంచు; నాజరఠనాయకి యాతని కెంతయేనియున్
బ్రేయసియౌచునొప్పుఁగదుఁ బ్రేముడితోఁబచరించుఁ జేతలన్. *
త్రోవంబోయెడు కుక్కమోది యిటు నే"త్రోలేసి" వన్ బోవదే
యావృద్ధాంగనయంచు నొక్కపుడు మోహస్ఫూర్తిఁజెంపొత్తుకొం
చే వేశ్యాంగనయేని కన్బడినఁ జూపెంతేని కల్పించుకొం
చావృద్ధాంగన దీనికంటె సొబగా "నాద్దం"చు నొక్కప్పుడున్
భావానందమెసంగ సింగనును దా వార్ధక్య నిస్సంగుఁడై. *
అటులతఁ డాడుచున్ ముసలియాలినిగూర్చి వచింప మాయసం
ఘటనపు మాటయయ్యెఁ గలకాలము నాటి నిజంబనంగ నేఁ
జటుల హృదిన్ దలంతు; నొకసాంత్వనవాక్యమునాడుచుంటు, వి
స్ఫుటముగ విందు, నమ్ముసలి పోయె నెయున్నదెయంచు నడ్గుదున్.
అనెడుఁగదా యతండు "ముసిలాముసిలప్పుడె పోయె, నాకు నిం
కనుసరిఁ బాతికేండ్లయినఁ గానపుడే 'చనిపోయెవద్ది" యం
చును, నిలుమన్ననిల్వఁడిఁక, జూడడు నెవ్వరి, "రాము రామ"టం
చెనసి మఱొంటు వీధిదెస కేగును నెత్తిని బాగఁబెట్టి వే. *

## 3 మేఁకపిల్ల.

చెట్లతో మూసికొనియున్న జీబుపుంతఁ
జూచితిఁ బరస్పరము మూంపు రాచుకొనుచు

సందడిని బోవు మేఁకలమంద నొంటి,
నొక్క-టేనంత చిన్నటి యొప్పలేదు.*
బొడ్డాడంగనులేదు; కన్నుఁగవనుం బూర్ణంబుగా విప్పలే;
దడ్డాదిడ్డిగఁ జేత గొల్ల నిలుపన్ హానేమి లేకుండ నై
జిడ్డుస్ వ్రేలెఁడు మేఁక పిల్లయది, పాల్ జేపింపలే దమ్మ్రనుష్,
నడ్డిస్ దెల్లని మచ్చతోఁ గడమమేనన్ నల్లరం గొప్పెడిన్. *
దాని తల్లినిగూర్చి నేఁదలఁచి తలఁచి
మందనంతను వెదకితి సందేఁగాన;
నొక్క- మేఁకయు వెనునైపు నిక్కి-చూడ
దీని నటువంటి వాత్సల్యమెందు జనెనో?
గొల్లవానిని నడిగితిఁ దల్లిజాడ,
వాఁడు తెల్పెనుగద తల్లినాఁడె యీను-
టంత నమ్మేక పిల్లను నతని కమ్మె
తల్లి నొక్క-కసాయి వాఁ డుల్లమలరఁ
గొనుట తా—పిల్లఁ బెంచంగఁ గోరియుంట,
పిల్లజాఱిన మఱియొక తల్లిపాలఁ
గుడిపి దానిఁ జీంబోతుసేఁ గులుకుచూట.*
ఇసువదియయ్యొ! తన్నటుల నెత్తుకమోసెడు గొల్లవానినిం
బసికొని ముట్టెసాచెఁ దలి పాలను ద్రావు నిసర్గచేష్టమై;
ఇసియనివాఁడు నీమమొగ మేమి టెయయ్యది, యింతదాకఁ జే
పొసగిన ద్రావవైతి విపుమాఱిక త్రావఁగఁబోదువంచ నెన్. *

కండగట్టిన కాయంపు బండతనము,
వెడఁగు నగవును, వెఱ్ఱిపోకడయుఁ, బలుకు,
సరిఁగుదురు, వెంకడన్న సోమరి సఖుండు
గరిమవ్రాయంగఁ జిత్రలేఖరికిఁ దొఱకె. *
మురళిన్మ్రోయగఁ జేయుకృష్ణువలెపెన్వ్యూహంబుమన్యన్మహా
కురువీరుల్ సుడిముట్టవ్రాలు నభిమన్యుంబోలె-నద్వైత బో
ధరతుండగ్గురు శంకరుంబలెను, సందర్భించి యవ్వాని సు
స్థిరతన్ దిష్ఠునిష్ణుఁ జేయుచుఁ దమిన్ జిత్రించి పత్రంబుపై *
మృదుమధుర మందహాసంబు బొదల నల్ల
చిత్రలేఖరియును మిత్రుఁ బాత్రుడవనఁ,
గాగితపు బొమ్మలోఁ దనబాగుఁ గనుచు
నవ్వువాఁడుగ వెఱ్ఱిమానవుఁడు వాఁడు. *
న్యాయవాదిని నసత్యాలాపియని యూఁడు,
వైద్యుఁ డాయువు బోయువాఁడె యనును,
ఒజ్జయేమిటి సెప్ప నున్న పాత్రములను,
వర్తకుం డెంతొ లోభాత్ముఁడనును,
న్యాయమూర్తులకంటె న్యాయవేత్త కలండు
దైవం బటంచును దఱిమి చెప్పు,
పెండ్లేమిటికి నను, వేడ్కఁ బల్లకి నెక్కు-

నుత్సవంబంచుఁ దా నుత్సహించు,
నొక్కపాత్రంబు చేఁబూని యూరఁ దిరిగి
వాఁడు సర్వప్రపంచంబు గోడి వెట్టు;
నెదుటఁ జిత్రలేఖరిని నెంతేని మెచ్చుఁ
దన్నుఁ దిన్నఁగ వ్రాయుచుఁ దయఁ గనంగ. *

## 5 శృంగారోద్యానము.

ఫలపుష్పలతులతోఁ దులఁదూగు తరువులఁ
దరువుల నెగఁబ్రాకు తరుణలతల,
వాసిగా నెగయుచుఁ గూసెడు పుంజుల
పుంజుల జతఁగూడి పొదలు పెంట్ల,
నలసత విడనాడి మెలఁగెడు తేటుల
తేటుల రంజిొచు తేటిబోంట్ల,
పుట్టల వెలువడి బుసకొట్టు భోగుల
భోగుల వెంటాడు భోగిసతులఁ,
గనుచు నేనొక్క శృంగారవనమునందు
సంచరించెడు నెడఁ దిలకించినాఁడ
శీతలచ్ఛాయ నీనుచుఁ జెన్ను మెఱయఁ
జాలు జోడు బాలరసాలసాలములను.*
లేతచిగుళ్ళతోడ, మఱిలేదనకుండఁగ బూయు పూతతో
నేతరిఁ గాయునా యనుచు నెంచుచుఁ బెంచెడు నీళ్లపాదుతో



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | 1PLWA10DB197 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 26-10-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | Ci, BCi |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | KDaveeD |
| పరీక్ష చేసినది | lakshmi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనిది | |
| తప్పులు | No |
| పరిస్థితి | Good |

నాత్రరువుల్ జెలంగెడును, నారయు తీవెలకెల్ల నాత్మలన్
జూతము లివ్వి యల్లుకొనఁ జూతమటంచును గోర్కెలెత్తగా.*
వాని నీడగాంచి యెంతొ పాటునొందినట్లు నా
మానసాబ్జ మున్సరని శ్రమంబు సెందసాగె; న
ద్దాని నెఱిఁగి వడిగ వడిగఁ దత్తరువుల చెంతకున్
నేను జేరినాఁడ నందు నెమ్మి విశ్రమించితిన్. *
పగులు మాటాడ నచ్చ టెవ్వరును లేరు,
కాని వినఁ దొడంగితిని వాక్యములు మిగుల,
అచ్చెరువు హెచ్చ వెదకితి నంను ముందు
నేరు గన్పడ్వరెరి యేయెడలనైన. *
పలుకులు మాత్రము దాపునె
పలుకుట విననయ్యెఁ జుట్టుపక్కలఁ జూడన్
దెలియఁగఁ గల్గితిఁ దుదకటఁ
గల యా మామిడులు దాని గావింపంగన్. *
చెట్టుపట్టులు వేసినట్టుల చెలువొప్ప
ననోన్యమును శాఖ లలము కొనుచు,
తగహస్తతలములఁ దట్టుకొనె ననంగఁ
జిగురాకు నొండింటిఁ దగులుకొనుచు,
నడుమను బక్కన నవ్వెనో యనుపోల్కి
సుమజాలములు తాము జూపుకొనుచు,
గూఢంబుగాఁగఁ బల్కులఁ నూముకొనుగతిఁ

జిరుగాడ్పులను బైని జిందుకొనుచు,
నచట నా రసాల ద్వయ మతి రహస్య
ములను మిత్రులు వడి వెలిబుచ్చు సరణి,
దగ్గఱ నొరులు లేరని తలచుకొనుచు
రవము లొనరించె నిట్లు నా చెవిని బడఁగ. *

"ప్రౌఢమైన నీకుజ్జప్తి? మొనమొన్న నె క్రొత్తగ వల్లిప్రాకె నీ యెడలకు, దానియందమును నేటికిఁ జెప్పట? దాని కేమి య య్యొడుపును జూచియుందు: తన యూహాలనున్మన పైనిహత్తి యే తడవున నిట్లు వచ్చి మన దాపుననే విహరించు చుండెడిన్."

"అగునగు నేను జూచితిని నయ్యది యేటికి ముచ్చటింప? నా పగిది జరించు మాత్రమున భావము నీపయి నిల్పియున్న దం చూగిఁ దలపోయరాదు సుమ, యుత్తమజాతిది కాకపోవునే? సొగసుగనుంటి నేను నను జూచెనటంచును నెంచుటొప్పునే?" *

"నేను దెలిపెదు దానిని వీనులొగ్గి
వినుము నదుమను బలుకకు—వెనుకనన్న
వల్లి వెండియు నీవైపు వరలుచుండె
మనల పరిసరమందె యీ వనమునందు. *
జారించు చుండనే మారుతంబని మన
ప్రక్కకు నల్లనఁ బడుచునుంటు,
పడుచు నింకెవ్విధిఁ బైకి నెక్కుటటంచు
మన వైపునకు వడి మఱలి ప్రాకు,

ప్రాకుచు నిదియేమి రశ్మిగాయటంచు నీ
చలువ నీడలను విశ్రమము గాంచు,
విశ్రమంబునుగాంచి వేయు దప్పియటంచుఁ
దగ మన పాదులఁ దడియుచుండు
నౌర! దీని నెల్ల నతి స్పష్టమగుచుండ
సందియంబు నింకఁ బొందనేల?
వినుము నిశ్చయముగ వేదనఁ బొందెడు
మనల నంద నెంతొ మమత బెగసి."*
"అన్యతరువు నంటి యలరంగఁ దగినట్టి
తీవవంక నెపుడు దృష్టిఁ బఱుపఁ
గూడదంచు వృద్ధు లాడు టాలింపవే?
కాన మనకు నేల దాని చూపు."
"వృద్ధు లింక ననుభవింపంగలేమిని
నుడువుచుందు రట్టి వెడగు నుడులు,
ధరణి వల్లియుంట తరువుల కొఱకును
తరువులుంట వల్లి కొఱకుఁ గాదె. *
అల్లదే యరుదెంచుచుండెను నాలతన్ గనుమిట్టులే
తెల్లమయ్యెడు నీకు నే నిటఁ దెల్ప నేర్చిన దంతయున్"
కల్లగా దటు వచ్చుచుండె వికాసమొందుచుఁ దీవెయున్
మెల్లమెల్లన నేరులేరిట మేలుమేలని మెంచుచున్. *
లత చిగుళ్లను జాపె లలిత చూతములకు

నలపచ్చనాకు లల్లాడఁ దొడఁగె;
లత తావులను జిమ్మె లలిత చూతములకుఁ
జిగురు మొగ్గలు గడుఁగగురుపొడిచె,
లత దాపునకు బ్రాకె లలితచూతములకు
స్కంధంబు సర్వంబు గంపమొందె;
లత యల్లు కొనసాగె లలిత చూతములకు
గరము రసంబులు గరగఁ జొచ్చె;
అయిన దానికి నాశ్చర్య మందనేల?
ధర్మవిధిఁ బెండ్లియగుటలు దారు మఱచి
మనుజులే యన్యులనుగూడ మఱుగుచుండఁ
దప్పుగల్గునె తరులతా తాదృశముల? *
ఆపయిఁ జూడరాదనుచు నబ్జ హితుం డపరాబ్ధిఁగ్రుంకెడున్
జూపగ నేటికింకనుచుఁ జుట్టును జీఁకటి క్రిమ్మసాగెడున్
బాపమొ పుణ్యమో పయిని వచ్చిన సంగతినిం గ్రహింపఁగా
నాపయిఁ జిత్రగుప్తులకు నయ్యమధర్మనకే వశంబగున్.*

## 6 దీపావళి.

ఆజికి నాథువెంటఁ జని యచ్చట నాథుడు మూర్ఛవోవఁ దా
నాజి నొనర్చి దుష్టుడగు నన్నరకున్ సమయింపఁ జేసె 'సా
త్రాజితి లోకమందున నిరంతరమున్ దనకీర్తి నెచ్చ, నో
హో! జనులార! నేఁడుపర మోత్సవమున్ జలుపంగ నయ్యెడున్ *

నేఁ జాటక పూర్వము తా
రే జలుపుచునున్న వార లింపుగ వేడ్కం
తే; జాయపతికిఁ దోడ్పడి
వే జయమునుగూర్చెనన్న విఖ్యాతిక దా?
తెలవాఱకమున్నె వడిఁ
దలంటులఁ గొనుచు జనములు దద్దయు భక్ష్యం
బుల భుజియించి, దుకాణం
బులఁ గొనుచున్నారు సరుకు బుట్టలు నిండన్.
సూర్యుని మించఁగఁ గాల్తుము
సూర్యుండిఁక నేటికనెడు సుద్దులు విని తా
ధైర్యమున నిలువజాలక
సూర్యుం డపరాబ్ధిఁ గ్రుంకఁ జూడగ నయ్యెన్; *
దిబ్బుదిబ్బని కొట్టుచుఁ దియ్యపడుచు
చిన్నవారు పెద్దలముందుఁ దిన్నెలందుఁ
గూరుచుండి గుగ్గిలపాఁజ్ఞ గొనుచు, మొదలు
పెట్టుచున్నారు వెలిగింప వివిధములను.
రత్నముల్ గాని వివిధ చిత్రములు వ్రాయు
చున్న వారలో యనునట్టు లొప్పమీఱు,
జ్యోతులను భక్తిరక్తుల నోహహా యనుచు
నిలుపుచున్నారు వరుస వాకిళులముందు. *
"అక్షయ ప్రభలున్న నక్షత్రములు గావె?"

"నక్షత్రములు జారెె నభమునుండి"
"రవ్వ వేయంగ ఫిరంగి యియ్యదికాదె!"
"అహా! ఫిరంగికద తాటాకుకాయ
"అర్థమేమైన ముత్యాల పేరులుగావె?"
"అల ముత్యములు సువ్వె వెలుంగుచుండె"
"చలువయందున్న వెన్నెలయె యయ్యదికాదె"
"నేఁ డొరచూడు వెన్నెలలకాపు"
అనుచు మదులందుఁ గుల్కుచు నతి ముదమున
వెన్నముద్ద టపాకాయ వింతగొలుపు
నల జపానుపుల్ల మతాబు నహహ! జనులు
కాల్చుచున్నారు వీథులనిల్చి మిగుల.*
ఈవసుధన్ జనులిటు దీ
పావళి యొనరించుచున్న వార్తల్ మింటన్
దేవత లెఱుఁగఁగ, దారా
జూవల్ విడుచుచునునుండిరి జవ్వనరహితో.
ఒండొరుల పైనిఁ దూటాల్
దండిగఁబడ విసరుకొనుచుఁ దలపోతురు పూల్
చెండులుకద యయ్యవి యని,
మెండగు నుత్సాహమున్న మెయి దెలియనుగాఁ!
దీపావళి యిఁకఁ జాలును,
జూ! పౌర్ణమి నలచవితిని జూపఁగ వలయున్,

దాపుననున్నవి యనుచును
లోపల ననుకొంచు నిండ్ల లోని కరిగినాన్.
తమకుం గాలిన దనుచోఁ
దమకే సిగ్గగునటంచుఁ దలచుచుఁ బిన్నల్,
తమ పిల్లలకును సుక్షే
మ మనుచు పెద్దలును నిదుర మఱిఁ జెందిరిగా.*

## 7 నిష్ఫలము.

"హయఖుర సంఘట్ట నాతిశయ ధ్వని
ఘనరాజ మార్గరంజన మొనర్ప,
గానోపకరణ సంఘాతరవంబులు
సరసోన్నత స్థలోత్సవము నిడఁగ,
స్వైర విహారార్థ సల్లాప వాక్యముల్
లలితశాద్వల పథోల్లాస మొసఁగ,
సాంధ్య వాతోద్ధూత సాంద్ర భంగస్పర్శ
మృదుసైకతస్థలి ముదముగూర్ప,
కనుచు, నొకమూల, గూర్చుండి కవిత! నీవు
మౌనమూనుదె? నీ స్వాదు గానరసము
జిలికి కరము మంజులమగు పలుకు పలికి
యెంతయును నాకు హృదయ ప్రశాంతి నిమ్మ." *
"పలుకుమటంచు నాడెదవుపల్కఁగలను, పల్కుటన దేమి తెల్పుమా"

"పలుకఁగనున్నఁగన్పడదె, వచ్చినఁజూపెదరమ్మకాంచుమిా,
చెలువము మిాఱ నిట్టటులఁ జిత్రవిచిత్రపు వాహనంబులన్
దలపఁగరాని వేగమున దాఁటిని మానవులేగు వారుగా. *
కనుమాయప్పాయ మెక్కి మెర్పుబలెనొక్కండం దెమాయంబయె
స్వానుమా "విజ్జ" నియొక్క బండియదిగో వేగంబునన్ వచ్చెడున్,
మనమిచ్చోటనునిల్వఁగూడదిఁకరమ్మా" "యండదేకాన్చుమా
తనిపాగా యెటువెన్కకుం బడెనొచూతంబింకఁజిత్రింబులన్. *
అదె తనయండ నంగనుకునరి మ్రలిబీఠముసిచ్చి కళ్లెమున్
వదలి రయంబునన్ జనెడు వానిని బోలు రసజ్ఞుఁ డుండునే"
"పదిలముగాదుసూ యిచటఁబల్కుచు నిల్చుట, బండ్లువచ్చున
ల్లదె యటునిట్లుకూడ, వడినారయ కీ మనపైని బోయెడిన్.
జనులటు విశ్రమించి కడుశ్రద్ధను విందురు, బాలకుల్ రహిన్
మనమున బొంగుచున్ వరుసనాట్యముసల్పుచునాడుచుందు,రం
దున నొకియింత నిల్వఁదగుఁ దొయ్యలి!" "ఏమి విశేషమో?"
"అహా! — — — — — — —
అనుపమహూణ గానమునునందునొనర్చెడువారుగాయకుల్" *
"గాన మన నీకు నంతటి కాంక్ష యేల?"
"రాతిగుండెను నైనఁ గరంగఁ జేయు
నెండు మోడునకైనను నిగురుగూర్చు
గాన మను నెడ వినఁ గోర్కె కలుగకున్నె?" *
"అటులా! అట్లగునేని యేగుదమువే నాగానముం గ్రోలఁగా

గుటకల్ వేసెను నాదునాత్మయును" "ఓకొమ్మా! భవద్గాత్రిమ
శ్లైటులుండుస్ వినుఁ బాలుజక్కెలిలు దాకేకంబనంబొల్చు నీ
పటుశబ్దార్థము రాగముం గలసి మేపట్లనస్ మనోజ్ఞంబులై. *
కాంచుమా యదిగో! యాకాంచనగంధి త్రా
మలయ వాయువులకు వలపుఁ జేర్చు,
కనుఁగొను మదిగో! యాకనకాంగి బండికి
నెనన్న శక్యముగాని వన్నె దెచ్చు,
వీక్షించుమదె! యామృగాక్షి పోత్తముబూని
కడుసామెతకు సార్థకత్వమిచ్చు,
ఒగిఁజూడు మదిగో! యాసొగసుకత్తె నడక
వలువలకును షెళ పెళలఁ గూర్చు,
అరయుమా యల్లదే యల యలరుఁబోఁడి
దారి నడచువారికి మృదుత్వంబు నేర్పు,
సరిగఁ దిలకింపుమీ యల తరుణి తన్ను
జూచువారల కెంతయుఁ జూపుగఱపు." *
"చాలు! పురుషుండ వగుటను స్త్రీలఁ జూచి
మెంచుచుంటివి కాని వీక్షించు మరుగొ
స్త్రీలకంటెను వింతగఁ జెలఁగుచున్న
పురుషులను జూచి మెంచదే పొలఁతియోర్తు.*
జంగమయ్యాలె మహాసృష్టిలీ యుగము నా
దుస్తు లాతనికిచ్చు దొడ్డరూపు,

విద్యావిహీనతె విలువ చూపెడునన,
వెఱగు లాతని పెచ్చు పెఱుగఁ జేయు,
బ్రహ్మచర్యంబె సరసత గొల్పెడునన౯
జెలువ యాతనికిచ్చుఁ జెట్టపట్టు,
ఘనభేషజమె వరగౌరవం బనుకొన
వేషమాత్రనికిచ్చుఁ బెద్దతనము,
మౌనమేయిచ్చుఁ బాండిత్యమహిమ యనఁగ.
బరులు మాటాడబోవ రానరునితోడ,
త్రిప్పుకొనుటయె మెప్పందు నొప్పు లనఁగ
నడక లాతని నెందుఁ గన్బడఁగఁ జేయు."*
"అంద ఱారీతి నుందురె? అయ్యొ! యచటఁ
గానమయిపోయెఁ గాబోలు కనుము జనులు
వేఱువేఱుగఁ జెట్లను విడిచి తేటు
లేగులాగు సంతుష్టులై యేగుచుండిరి.*
ఇఁకనటు పోవనేమిటికి నింపులు నింపెడుఁ గల్కి చెల్లెజూ
యొక నిమిషంబు నిట్టిట్టుల నొప్పగనిందు విహారులాటః తొఁ
బ్రకటితమయ్యెడిన్ బథము పక్కలఁబొల్చెడు గున్న చెట్లతో
నొకయెడ విశ్రమింపఁదగు నోపిక నీకిసుమంత తగ్గుచో.
వనిత! నీకెంగేలు పట్టెదనని చాప
నరుణ కాంతులను మూయంగఁ గలదె?
ముదిత! నీనెమ్మొము ముద్దాడుదు ననంగ

నిందునందెమపాటి యెత్తుగలదె?
చెలియ! నీ చనుగప్పు దొలగింతు నని డాయ
మలయ వాయువుమించు బలముగలదె?
మెలత నిన్నురతుల మెప్పింతునని రెచ్చ
గొమ్మకిందకురాగ గోర్కెకలదె?
యనుచు విటులాడు వాక్యముల్ వినుచు దగిన
రీతి వారివారికి నలనాతి తిరిగి,
యుత్తరము లిచ్చుచును నెట్టులొప్ప లొలుక
వే నరుగుచున్నదో నెఱజాణ గాదె. *
ప్రియసతి వచ్చునంచు దమివేచు నొకండు శిలాతలంబునం
బ్రియసతి వచ్చెనేమొయని వేగిరపాటు నొకండు చూచెడున్
బ్రియసతి రాదటంచు కడువేగి యొకం డిటునట్లుగుమ్మరుఁ
బ్రియసతులున్న వారి కెటుబెట్టెనొ పాట్లను ఓ! తలోదరీ!
అటుచనబోకు మాయెడల నారయ నెంతయు వేడ్క మీఱ ని
ష్కుటిల సతీపతుల్ మలయ గోరుదు" "రట్లగు నేని యేటిక
చ్చట దిరుగాడ నెవ్విధని జాయకు భర్తకు నడ్డుపోదు మో
కట! నడువంగరాదె యలకన్బడు చక్కని సైకత స్థలిన్."
"నడువగరాదెయంచును మనంబున సందియమంద నేల? యా
కడలియె స్వీయవిద్యలను గన్బడ జేయుచు దన్ను జూడగా
వడి బఱతెంతు రీ లోకులని పక్కనె మెత్తని సైకతంబులన్
గడు బఱుపంగ జేసినది:గౌరమీయ దలంతురీగా ఘనుల్ *

విద్యార్థులు డింభకులును
నుద్యోగులు బాలికలును యువతులు నిసువుల్
సద్యారంభిత పవనుని
వాద్యం బాలింపవచ్చు వారలు సూవే. *
నీలమేఘపుమాల నేలంగఁ జాలెడు
డాలునంగార్చిలు విశాలతలము,
కులిశ పరిభావముస్ జులకన వుచ్చుచుఁ
దులకించు డిండీరద్యుతుల సరము,
బడబాగ్ని దుడుకును గడుపున నిడుకొన
శక్తిగల్గినయట్టి చలువదనము,
అంబరంబునకు వియ్యంబుగూర్పఁ గరంబు
డంబుమీఱు మనోహరాంబు కణము,
పరిణుత గాంభీర్యమురుకీర్తి యనుపమమగు
చెలువమును మంచి శోభయు, గొలుపుచుండ
నెదుట నల్లదె! కంటికి ముద మొసఁగుచు
వెలయుచున్నది విఖ్యాత జలధి కవిత? *
పలుకుమి యొక్క-మాటిట భవద్వరవాక్యము చాలహాయియై
జలిపెడు విందు వీనులకు—జాలరి యల్లదె చాపదింపె పే
రలవడి నొడ్డుచేరుచును—నచ్చటఁ జూపును పెద్దచేపలన్
వలలను విప్పివేసి, తన భార్యకు నిండుగబుట్ట నింపుచున్. *
ఫేనసౌభాగ్యంబు వీక్షించియేమొ యా

నీలకుంతల యట్లు పూలుచుట్టె,
భంగవిస్తారంబు బరికించి యేమొ యా
యల్లగోలట్లు కుచ్చెళ్లువోసె,
అంబోధినాదంబు నాలించియేమొ యా
ముగ్ధ యట్టులస్వేచ్ఛ పాదలఁ బలికె,
మలయవాయువులను దలపోసియేమొ యా
ధీరయట్టుల వేడి యూరుపూనె,
చెదరు తుంపురుబొంట్ల నీక్షించియేమొ
మందగామినియట్లు చెమ్మటలఁ దుడిచె,
నెగసిపడు మీనముల గణియించి యేమొ
వ్రీడయట్టుల కన్నులు విప్పిమూసె. *
కొందఱు నత్తలేరుచును గొందఱు పాత్రములందు జూచుచున్
గొందఱు చింత జేయుచును గొందఱుభక్తి నమస్కరించుచున్
గొందఱుగ్రీష్మఁ దేలుచును గొందఱు పాదములల్ల నాన్చుచున్.
డెందమునంద మోదము దలిర్ప సముద్రిదరిన్ జరింత్రు జూ. *
పాడుమొక గీతరాజము
నాడుమొక మధురవచనము నాలింపంగన్
వేడుకయయ్యెడు మిక్కిలి"
"కూడదుసుమి మదినినట్టి కోరికబూనన్." *
"ఆపగిదిన్ వచింపకిక హాస్యముగాదు, మొగంబు దిప్పు దే
చూపఁగనెల్ల చూచితివి — చూపవె నీమనురన్వరంబునున్"

"ఛేపిటు ముందువచ్చి కడుఁబ్రీతిని బాడును కోపమొందకీ
తేపకు వీడఁ బుచ్చునను, దిన్నఁగఁ జూచినవేళ మించెకుఁ. *
అబ్జాప్తుతమవెన్క నస్తమింపఁగఁ జేసి
సాంధ్య మేఘద్యుతి జలిపుచుండె,
కలికాంతు లందందు వెలిబుచ్చుచును శుభ్రి
శుక్రోదయపుశోభఁ జూపుచుండె,
వరుస నొక్కొక్కటి వడివడి వెల్గుచు
తారకావళిరీతిఁ దనరుచుండె,
ఘూళిఘూసరములఁ జాలరేగించుచు
నాలమందలతీరు నేలుచుండె,
హర్మ్యకుడ్యముల్ దీపగృహస్థదీప్తి
చంచలాద్యోతి గణములు జనులపోక—
వంటదైనది యంచును వార్తదెలుపు
నాకలియు వేయుచుండెడు నాకు నిపుడు." *
"వచ్చువారిని నడుగ నిమ్మచ్చె—నాదు
పలుకుననకొంటి మున్నె నిష్ఫలమటంచు"
"నీవు పల్కుట నే బల్కుటీ వెఱుఁగవె
ఫలము లేకుండుటేమి నిష్ఫలమె ఫలము." *

## 8 కపాలరాజమా!

ఘల్లుమఱుంగునందొక నివృత్తినినొంటిఁ గపాలరాజమా!

తెల్లని మొనమ్రక్ మిగిలి తిన్నగమంటిఁ గనంగరాక నా
యుల్లమునాచి కన్నులకు నూఱక తోచెదు పూనమగ్నవై.
అల్లవయో విలాసినివొ? ఆర్యజరాకృశితాంగ నష్టివో?
ఫుల్లహృదబ్జరాజమవొ? మూఢతమా కులమానసంబవో!
తల్లివొ? తండ్రివో? సుతసుతాది బహుప్రియ బంధువర్గమో?
ఎల్లఱుగాని యొంటివొ? ధనేశ్వర సౌఖ్యరసైకలోలవో?
ఎల్లికి లేనిపేదవొ? అవేమియు నిన్నడి యాలముంచవే?
వెళ్లెదొ నాకలోక పదవిన్ దనివారగ? గౌరవంబునన్
దెళ్లెదొ? వెండిఁబుట్టెదొ? మహేశుమహాంశను నైక్యమొందువో?
చెల్లెదొ పంచభూతముల? చేతము దప్పని యాత్మమాత్రివ
త్రిల్లెదొ? వానినేమి నిను నించుక నేరగ బోధ సేయవే? *
అతిరమణీయదృష్టిపథ మా కనుగుంటల నింకిపోవఁగన్
మతి తల వీడఁగన్ జవులు నాలుకఁ బాయఁజెవుల్ జెవుడ్పడన్
సతతము బ్రాణవాయువున సాగెడు నాస విరామమూనఁగన్
మృతిఁ గనునంత నిన్నొలికి మొట్టకు జేర్చిరి చూడ డొక్కఁడున్
ధృతివీడకీవునూత్రి మిఁక నేల? సశేషసుతూష్ణభావపుం
వ్రితతిని గానుపింపవలెనా తవ పూర్వపరామృత స్మృతిన్? *

## 9 ముగ్ధతృణవ్రజము

తిన్నఁగదెస్స తుమ్మ కడ తెన్నునె పల్లవునీటిపాయు ప
జ్జన్నడువంగఁ గాటిని వెసన్ జెలువంబగు చిన్నిరేవు చె

తన్నిలబెట్టి యున్నతలఁ దాలుపుఁ బచ్చికమోపునొంటి; లే
రన్నడనేరు; దానియెడ నాగితి; "ముగ్ధతృణప్రజంబ!" యం
చున్నడినాడఁ బోయితి మహోహరభావము గందళింపఁగన్.*
తూటికాడ పూలు నీటిలో నోలాడెఁ
బ్రిక గ్రజొన్నచేను పైరుగాలిఁ .
గదలుచుండి యెరయు కంకుల సందునే
సంజపొద్దు తెలుపుసన్నఁ జూపె.
క్రిందనున్న దారినిరు గ్రేవ నలమిన
మినుము పెసరమున్న మెఱకపంట
కాయగాచియొక్క కమ్మని పసిగొన్పై
నద్దరి ప్రతిబింబ మందగించె *
ఆసమస్తంబుగాంచ యోజాగ్రమయ్యె:
ఆసమస్తంబుకంటె యోజార్హమయ్యె
నాన్యమైనట్టి ముగ్ధతృణంపుమోపు
తాళపత్రి విజీర్ణ బంధనము దగిలి. *
సోలెడు సోగమోసులోక చూపు గరంచెను: వాడులేఁత పూ
జ్జాలి గొనంగఁ జేసెఁ బసిచక్కని దక్కగలట్టి చక్కనన్
దాలిమిఁ దూలిగట్టువడు తద్విధమొల్లను నన్నుఁ జింతకున్
బాలుపడంగఁ జేసె నలపక్క నిషణ్ణ విషణ్ణ గాఁగవే. *
తోడిమోకల వీడఁదొరగు బాష్పంబునా
నురలె ముంచెత్తిన యుదక కణము.

కోరకావస్థనే కొడవలిఁ దెగియెనాఁ
దలవాల్చె నొకకాడ తలిరుటాకు,
పంటలో నొరుకంటఁ బడని పాప్రిపెడ సెనా
విడివడె మెలిక తీవియ సుమంబు,
తృణభవ్యమైన బంధెంబు తప్పనిదినా
కట్టూనె శాద్వల కాండచయము,
అనుచుఁ దలపోసికొంచుఁ దదైకదృష్టి
నున్నని మునాన సస్యప్రసన్నవీథి
నొడలి రారాపు గఱగఱ నడచి వచ్చు
నొంటి సామాన్య మాతంగి నొర్తుఁగంటి *
శీర్ణ శిరోజావళియును
జీర్ణాంబర మున్ను లేమి చెప్పక చెప్పన్
వర్ణోచిత భూషణతతిఁ
గర్ణాములఁ దాల్చి పొలముకడఁ జను వెసఁగన్
రా రమ్మమెమ్మేడు వేళకుఁ
జేరనిచోఁ గొత్తకాసు చేవడదంచున్
జేరిక వెనువచ్చెడు పా
లేరున్ దలకెత్తు మనుచు నెత్తినయంతన్ *
ఇంతి లవిత్రి మా కసవునే యిఱికించుక చీరచెంగు నం
చంతయు దోపి యొక్క చెయి నల్లన నెత్తిని మోపు నిల్పుచున్
వింతగ నొక్కచేయి నెటువీలొయటుల్ సవరించుకొంచుఁదా

సుంతయు వెన్కఁ జూడక వసుంధరఁ బాపెను దత్తృణవ్రజిన్.

## 10 భువనేశ్వరము.

చూచితినెల్ల ప్రొద్దునదె చూపుగఁ జూచితిఁ జాలకాలమున్
మోచి నశింపుగాంచెడునపూర్వ మహోన్నతభూరిశిల్పి వా
గ్సూచిత గోపురంబులవి చొప్పడె లెక్కకు మీఱునట్లుగా
నాచోట నాచోటఁ బొడవులై తమయంతన లేచుకైవడిన్.*
అన్నిటికంటె నెత్తైనదై యంత సం
స్థూలమై తనలోని నీలకంఠు
నిప్పటికినిఁ బూజనెంచంగఁ బెద్దయౌ
భువనేశ్వరంబును ముందుగాంచి,
మందిరాల్ గడచి శ్రీమందిరమున స్నిగ్ధ
మై యార్ద్రమగు విగ్రహమును నరసి,
చుట్టుకట్టడముపయిఁ జోద్యంబు గొలిపెడు
శిల్పినెంతయుఁ గాంచి, చేతలోన
వన్నెకెక్కిన నిశాపార్వతీ విగ్రహ
సందర్శనంబున జాగొనర్చి,
తక్కఁగల దేవళంబులఁ జక్కఁ జూచి.
తలను పైకెత్తి యుత్తుంగ "కలశశిఖర"
పటము నాళాసిరి, గనుమ నటుల నటుల
నేలకును డిగఁ జూచితి లీలఁ బొడమె. *

గౌరీకేదారేశ్వరు
జేరిక నెపు డూరుకొలఁకు శీతాంబువులన్
గోరికమెయిఁ గుగ్రింకిడుచో
నేరీతి యకల్మషంబు లింకకయున్నే?
సిద్ధేశ్వర దేవళపు ని
బద్ధ ప్రతిబింబమల్ల పజ్జను సరసిన్
సిద్ధుని భావపుఁ బ్రతిమన
నిద్ధంబై తోఁచెను రమణీయతరంబై. *
రాజరాణిశిల్పి రమఁ జిత్రముగఁ గన్న
కాలమెల్ల మఱచి కాంతుముగద,
చిన్నిచిన్ని పనులు చెలువంపు నగలును
కట్టు సొబఁగులు కనుఁగట్టుగావె. *
ఇంకఁ గాంచితినిగా నెందెందు నున్నట్టి
జంబుకేశ్వరమును, చాలఁగూలి
నను శిల్పి కన్నీళ్ళు గొనునట్టు శోషించె;
మేఘేశ్వరుని నొక మిద్దెఁ గంటి
పరమేశ్వరమువంక బ్రహ్మేశ్వరమువంక
భాస్కరేశ్వరువంక వరుసవరుస,
విసువనకుండఁ గావింతగాఁ జూచితి
నెచ్చోటఁ జూచిన నచ్చెరువెగ
శిల్పిపని, గోపురంబుల కల్పనంబు,

సంఖ్య, చూడని వెన్నియో చాలకలవు.
సంజపడిపోయె నలసియే చాయబలియు
గున్నగానుగ చెట్లనేఁ గూరుచుంటి. *
మామక పురస్సరంబున
స్వామై దిఙ్మండలమున సవితృఁడు గన్నై
యామాత్రములో గ్రుంకెను
వేమొగులగపించె నంత్య విశ్రుతిఁ దొగర్రై.
ఒక తీరుగఁ గనుజీకటి
శిఖరతలంబులను గప్పఁ జేరికఁ గల య
న్నిఖిలము నిశ్శబ్దతఁ గొనెఁ
బ్రకృతికిఁ బలుకాడనపుడు పాటవ మఱనాస్. *
కదలిక సుంత లేక మునుఁగట్టిన దార్ఢ్యము తమ్మె నిల్పనా
నెదుటను నిల్చి యావన మహీజములందున నందునందు నె
మ్మది కొకచోద్యమై వెలసి మానవిలగ్నము కాచు స్థాణుసం
పదనుఁ బ్రతిష్ఠమయ్యె సమభావిత గోపుర రాజి సర్వమున్.
నాకును దోఁచలేదు మననంబున బల్కఁక లేని, భావమున్
జేకురె నెంతొ వింత ఇటు చెప్పఁగఁ జాలని శిల్పినిల్పి, ఆ
యాకృతి దేవళంబులను నన్నిటి నేటికిఁ గట్టినారలో
యేకలి మందుఁ బెట్టిరొ? యదెవ్వరొ యెండఁ జీవల్లనయ్యెనో *
ఒకచోటఁ జక్కని యొప్పైన మండలా
కృతికదా ద్వారమదెంత నేర్పొ?

ఒకచోట నొకపంచ యువతి విగ్రహ మెల్ల
డాకాలి నిలుచు విలాస మహహ!
ఒకచోట నొకమావి నొక్కొక్క చిగురాకు
మలచి చెక్కిన పని మఱువశమె?
ఒకచోట గుమిగూడి యున్న శిష్యుల కొక్క
ఋషి కత సెప్ప తీరేమి సెప్ప!
కాని యట్టి వెన్నెన్నియో కఠినమూర్ఖ
ఖరతురుష్క కర్కశతర ఖడ్గభగ్న
భగ్నములుగా వె—అయిన రవ్వంత మిగిలి
యున్న ననుకంప మొందించు చెన్ను జూపు. *
వెనుకటి రహస్య మింతయు వెలికిఁ బెట్ట
దా స్థల మహాత్మ్య మదియేమొ యుండె కలదొ
గౌరవము దాని కంతగా—కాలమహిమ
మనుచుఁ దలపోసితిని గదా యంతలోన. *
నీడయొకండు నాపొడవు నెమ్మని ముందటఁ బొల్చె వెన్కకుం
జూడఁగదూర్పుదిక్కననుఁజొక్కపుఁజందురుఁడునిండుకాంతులన్
వేడుక నంపఁజొచ్చెఁ గను విందొనరించుచు వెంటవెంట నం
దేడను వెన్నెలల్ బొలిచె నేకడఁ దెల్లని వన్నె యేర్పడన్.*
ఆవెన్నెలల సొబంగున
నావైచిత్ర్యింబె తోఁచె నలదేవళముల్
తోవెలసె నిశ్చలములై

యేవేళను మౌనభావితేక్షణములెమై.
మఱుచటి వేకువ లేచుచు
నరుదగు నాదేవళముల నరసితిఁగద సు
స్థిరములు మౌనములై యవి
చిర జీవితములుగఁ దోఁచెఁ జింతన సేయన్. *
ఓహో! ప్రాంశుతరంబులై చిరప్రసిద్ధోత్తిష్ఠ సన్మూర్తులై
నీహారాంశుని తేట వెన్నెలలలో నేన్ సంధ్యనేన్ వేఁగునేన్
దేహీనిత్యమవధ్య మన్నయటు లా దేవాలయాల్ నిత్యతర్క
సాహంకారత శిల్పి నూనుచును బ్రాశస్త్యంబుగాల్పించెడిన్*

## 11 కొండప్రక్క పల్లియ.

ఆకఠినాఢ్య గండశిలనైనను జల్లనివాన జల్లుచే
నాకు చిగుళ్ళు వోసెనన నద్రితలంబు నశేషభాగమున్
మేకొనెదట్టి పుంబసరు మేపులు దాని పదాంతికంబునన్
దేకతరాచుకొంచు నొక యీాడున నొప్పెడు తాళసాలముల్
వీకసహస్రముల్ నిలిచి వీరభటాకృతి మీాఱెఁ; జెంగటం
బ్రాకట సాంద్రవేణుతతి పైకొనుగాలిని స్వైరగీతికా
నీకము గూర్చుచుండెః ఫల నిర్భరముల్ పనసామ్ర చూతముల్
మాకుల వెన్నొకాయుచు వినమ్రితవంగెడుపాంథసత్కృతిన్.
ఆకడ నాకడన్ గొలఁకులావుల దప్పిక దీర్చ నొప్పెడున్. *
తత్ప్రదేశ సందర్శ నోత్సాహులమయి

నడచి పోవంగఁ దాపునే యడవి మఱుఁగు
కంచెలోపలఁ బల్లియ కానవచ్చెఁ
గొండవారల గుడిసెలు కొన్నికలవు
కోయవారల గుడిసెలు కొన్నికలవు.*

మేలం బాడఁగ మేడలాకెలఁకు లేమిన్ దత్కుటీరంబులే
యాలోయన్ ఘనహర్మ్యరాజములశోభ న్మానసీయాలుబో
గేలింగొట్టగ నాగరీకులటు లేమిన్ దన్నివాసస్థులే
యేలోపంబునులేని మన్నెదొరలై యిచ్చన్ బ్రివర్తింతురిబో*

కొండకొండ నడుమనుండు కోన దున్నుకొనుచునో
యండ నటవి వేటలాడి యవివి తెచ్చుకొనుచునో
యెండయనక వానయనక యెలుఁగు పులుఁగులనక యా
గండు జీవనములవారు గడుపుచుందు రజ్ఞులై. *

అట్టి మన్నెపువీథి నడాడుచుండఁ
బుంతఁ బడిచూడ-చక్కని పూపకన్నె
యొర్తు కానఁగవచ్చె గ్రీష్మర్తి సలలి
తాంబు దాకస్మికా గమనంబు పగిది. *

చెవులఁ బూవులు చేతులఁ జివురుటాకు
మెడను గురివెంద సరములు మొలను జిన్ని
పుట్టమును దాల్చి యేరిన కట్టెలిన్ని
నెత్తిపైఁ బెట్టుకొని యది నెమ్మదిగను
కొండవాలును మించు జేగుఱుపదాల

వచ్చుచుండెను బ్రకృతి నిజేచ్ఛ నెలంగ. *
బాలిక పోగులన్ బువులఁ బాణియుగానఁ జిగుళ్లఁ గుత్తుకస్
మాలను జూచుకొంచు గరిమన్ సవరించుచు వానికెల్ల తా
వలమగు నవ్వనాంతరపుఁ బంధను జూడ్కుల నిల్పి యల్లలో
యలసిరి యీడుబిడ్డయన నాగక గొంకక వచ్చుచుండెడిన్. *
అల్ల పేదబిడ్డ కనువైన తోడవులై
వెలయు పువులు చూడు వెండివెండి
మానవుండు బీదగా నుండు మనికిలో
సృష్టి కలిమి మిగుల వృద్ధికాంచు;
మానవుండు కడు నమాయకుం డగుచోట
సృష్టి ప్రజ్ఞకడుఁ బ్రసిద్ధిఁ వడయు. *

## 12 చేనుకల్వ.

కేదార మధ్యమందున
నీదగు తెలిజేకులు రమణీయములై క
న్నాదటవో విడిచిన యవి
ప్రాదుర్భావంబు గలుపు పాటిదెయైనన్. *
వేకువ మంచుబొంట్ల నిలిపింపు లో రాతిరిఁబడ్డ వర్షసం
సేకకణంబులో పయిని జిత్రిములైయు దయారుణద్యుతిం
బ్రాకటమాచు నీదు తలమానికముల్ దొలకాడునాఁగ సొం
పై కనుపట్టుచుండె మలయానిలలోల వికాస సంపదన్. *

అవియొక వేళ-తావక రహస్యపు టశ్రుల శిష్టపుంజమై
ప్రవిమలమైన బాలరవి భానుమహాశను దేజరిల్లుచు
న్నవోకదుఁజూడఁజూడనయనంబులకెంతయుశాంతి గూర్చుచుం
టివి దిగనీని పచ్చని మడిన్ వికసించి వినోదసక్తవై *
ముంగలఁ గలపూవా! ని
న్నుంగని నే విడిచి పోతినో మది కలఁగున్
వెంగలులై యెవరైనన్
సింగారంబైన నిన్నుఁ జెండుదు రంచున్ *
హాళికుఁ డెవ్వఁడేని నిను నక్కటకక్కట! పెల్లగించునో
కూలికి వచ్చునాతఁ డెటు కోయుచుఁ బచ్చిక మోపు గట్టునో
గోలకుఁ బెట్టునో చిఱుత గోపకుఁ డొక్కఁడుఁ డాటపాటలన్
నేలలిఁ గోసికోనయని నెమ్మికవంగితినందు కోఁగ, న
ప్పూ లభియింపదయ్యెఁగదమూఘునిగన్ననుగూడనొంచెనో? *

## 13 సుందరాంగి.

మాపటి కటిక చీఁకటి యుపాయమ్ము బా
టించపనెత్తిన కెంపు టెక్కెమనఁగ,
ఒకయంకమాడి వేఱొక యంకమాడంగఁ
బన్నివైచిన మింటిపట మనంగ,
వేడి పగటివేళ వాడు పాంథుల కభ
యమ్మిడఁ జాచు చే యుఁగణిమయన,

భాస్కరకార్య నిర్వహణ సమాప్తియం
చర్పించు మంగళహారతియన,
పంజ చెలువారి, తనకాంతి పుంజమునను
మాప్రినిలేఁ గొమ్మఁ బక్షుల మఱలు తెక్క
మలయు యువయువతీ ముఖవిలసనముల
నుల్లసిల్లంగఁ జేయుచు నొప్పె నదిగొ!*
దినమణి దొంగిలించి తన దేహము చొప్పడకుండ నంతటం
మొనసెడునల్పు బాముకొనిముగ్రిచ్చు తెఱంగున బారుచున్న పా ప్రి
జెనటియనంగ దట్టమగు చీకటికప్రిమిస్తైన దెల్ల దిక్కులన్
జనులకు జారచోరగణసాధ్వస ముత్కటమైన పీడగా. *
వినుదీవ బంగారు విరులతో విరిసిన
పోలికనొక కొన్ని పొడముచుండె;
విన్వీధి కెంపుదీపికలతో వెలయించు
ఖ్యాతిని నొకకొన్ని బయలు పడెడు;
వినుసరంబి వివిధమణి గణఖచితమౌ
సరణిని గొన్ని సుస్థిరతఁ గొఱలు;
విను పోకడ, విమానఘన సూక్ష్మరుచులను
గతినొక్క నడకొన్ని కానుపించు,
రిక్కలెన్నెన్నొ తమ తమ ఫక్కి నోహహో!
పసిమిపైఁ గొన్ని తొగరు కొప్రిమ్మిసను గొన్ని
నిలిచి యొక కొన్ని మిడుగును గొలిపికొన్ని. *

పుట్టుపట్లను మెట్టెడుపట్ల శాంతి. *

చెట్లకెక్కిన చిమ్మచీఁకట్లు క్రిందకు
డిగినీడలై చింత దిగులు వడఁగ,
కొండలఁ బ్రాకిన ఘోరాంధకారంబు
గుహాల గర్భంబులఁ గూర్కొనఁగ,
కాసారమును గప్పు గాటంపుఁ దమసంబు
లబ్జకుడ్మలంగాల యండ గొనఁగ,
రోదసీమయమైన కూర్కరంపు టిరులెల్ల
యాశాంతముల నదృశ్యత వహింప,
నిండు జాబిల్లి వెన్నెల నిగ్గులుల్లి
తూరుపున బుట్టి తెరచాపఁ గేరుచుండె.
నల చకోరచకోరికా కుల వియోగ
జీవనంబులు సేయు సంభావనముల. *

స్వకుల భవిష్యన్నాశన
మకలుషితపు వృత్తి నెఱఁగి యేఁడుగో! పొడిచెన్
బ్రకటిత మిహికాశుభ్రిలతో
నొకఁడై శుక్రుండు! వెంట నొలసె నుషస్సుల్. *

బళ్ళ్ఁనఁ దెల్లవాఱె-నిఁకవద్దిఁక వద్దనుకొన్న మాట జా
త్రిల్లిన దంపతుల్ గొసకుఁ దీఱని ముచ్చట, నిండనట్టి కౌ
గిళ్ళ, నలంతి ముద్దులను, గెంటని మోహపు టోరచూడ్కినో
కట్టాళ్ళ నొకళ్ళుబాసి చను నప్పటి చప్పమొగాల చొప్పనన్. *

జగమెల్ల జాగరూకత
నెగడఁగ భాస్కరుఁడు బొడిచె నెటఁ గడచిన రే
వగమెల్ల చెదరి క్రొత్తగు
సొగసును సంతోషమున్ను సుఖమును బొదలన్. *
ఈవిధి నోచెలీ! దినమనేక విధంబులుగాఁగ క్రొత్తగా
భావము గందళింప నిను భావనసేయుదు, నీదు యౌవన
శ్రీవిభవ ప్రభస్ఫదలఁతుఁ, జింతన గొందుదు దానినే సతం
బో వెలఁదీ! వయస్సనకుఁ బొందిక యూహలనున్న పొందికే.
గొప్పతనానఁ గొండలని, కోమలతన్ విరి చెండ్లటంచుఁ గైఁ
జొప్పడ నిమ్మపండ్లనుచుఁ జొక్కపు నిగ్గునఁ బైడిగిండ్లటం
చొప్పులకుప్ప! మత్తత గజోన్నతకుంభములంచు జోడనన్
దప్పని చక్రపుంగవల నాయమటంచును, నీదు చన్గవన్
మెప్పులగుప్పి హత్తుకొన మేలములాడఁగ వచ్చు మారునిన్.*
విలు నిరసించు భ్రూవిరస, విభ్రమరేఖలఁ దేలు రెప్పలన్
జలనము నప్పళించి సరసత్వము మీఱఁగఁ గోపు చూపుచున్
వలపు మెలంగఁ జేసికొని, పాయకయుండిన నుండవచ్చుఁ బూ
ములుకులదండడిన్ మనిగిపోయియునేండలుపూంన్లనవ్వుచున్*
*మధుమధురాధరంపు జిగి మార్దవమున్ మనిపంటనొక్కుచున్
వ్యధయది యెంతయైన మఱువందగు నొక్కనిమేషమాత్రలో
నునమిసలాడు చెక్కిట ననూనతఁ జెక్కిలి హత్తుకొంచు హా
యన శతమేని పుచ్చునగ, నల్లనముంగురు లొత్తియొత్తి నె

నొన్నసల చౌకాటపుంబసల నూల్కొను నక్షత్రపజ్త్తిదన్నమా
నసమున నేర్చి యెంతయుఘనంబౌనగూర్పఁగవచ్చు; సాధుమం
గళగళ రేఖలో, భుజయుగంబో, యదృష్ట హస్తమో,
వళిసిరియో, గగుర్పొడుపు బొటిలువారో, యొయారి నీవియో
కౌలఁదునుమించు నాభియో, యకుంఠితరంభలదూరునూరులో,
అలతిఁ"గిటక్క"మన్నమనసయ్యో! చివుక్కనిపించుకొనో, నున్
బిక్కలసారో, పాదములు వేసెడు సంబరపాటో, వెన్నో, అ
మ్మక్క! ముఖారవిందమొ, బళా! మెయిదీవియ చెల్వొప్పలొక్కపై
దాపినసామొక్క, గంద మలదక దడియూరు బెడంగో, రైక బె
ట్టో, పయిఁ కొన్నసిగ్గొ, మదిలోపలిభావమొ, చొక్కొ, టెక్కొ, ట
క్కో కనుగొన్న కొద్ది ననుఁగోయుచున్నది—వల్లెవాటుగాఁ
గోకనుగట్టి త్రొక్కవడు కుచ్చెల నిచ్చనడాడుచున్న, డెం
తో పెరిమార వల్లకికిఁ దోడుగఁ బల్లవిబాడుచున్న, దా
నౌ పడకింటి కంకటి నిద్రై యొకవాలున సోలి యీడుగా
జోడుగ నత్తమిల్లినది, సోకునలేచి విరాళి వేగెడుక,
పోడిమిదక్కి యద్దమునఁ బోలిక లేదనుకొంచునున్న, దా
తలపుల పుట్టుఁదిట్టునది, తానయి పత్రికయొండు వ్రాయుచున్
వలదనుకొంచునున్న యది, వల్లెయటంచునె యోరమోమునం
బెనఁగుచునున్న దల్లదిగొ, పేరెముజూపుచునున్నఁ దొక్కమా
టని బతిమాలుచున్నయది, యర్మిలి మన్ననసేయుమంచుఁజి
న్నరి నవుదాల్పుచున్నయది నవ్యనయోజ్వలితానురాగపు

ముత్సరిపెనుముద్దుగూర్చునది, మోహములోనసమానమంచుసం
స్మృతికి నపారమైనదదె! ముంగల నంగన సుందరాంగియై,
కృతిని రచింతుఁగాక మృదుకేతకి పత్రముమీఁదఁ జెట్టునే. *
తావకనీలకుంతల ఘనాఘన జిగిఁ
దెమలుదునా చాతకమునుగానె?
తావకధవళస్మితాంకూర చంద్రిక
రంజిల్లుదున చకోరమునుగానె,
తావక మంజులాధరపల్లవాగ్రంబు
చుంబింతునా కోకిలంబు గానె?
తావకాఖిలమణితంబునారజము నా
కబ్బెనా జతపావురాయి గానె?
ఓ! మనోహర శోభనాంగీ! మనోజ్ఞ!
తావకంబగు పరిణయసంధానమమర
నట్టి సద్విజ నామంబు నేని తొల్త
జన్మము తరించి నూతన జన్మమంది.*
చూచెదుగాక నీచూపు కాగ్రింబన్నఁ
గొండంతగాఁ జేసికొందు పువిద!
ఎన్నుదుగాక నీసన్నని నడుమన్న
పెద గగనంబు గావింతు వబల!
బమగొందుగాక నీకొమిరెమేన్ జిగినన్న
పసిడితూనిక వాసిఁ గసరెదు చెలి!

సేవింతు నీదైన చికురపాళి నటన్ను
ఘనము గావింతు యౌవన శుభ్రాంగి!
నెల పొడువ నూలుపోగీని కలిమి కలదొ?
గుప్పిటికి జాలు బిచ్చంబు గూర్పరొ భువి?
వజ్జగింజంత కే యుల్కు వారలుందొ్రి
చిట్టిపాపటకే పట్టుపట్టుదురొకొ! *
నెలంత! నీయుచ్ఛ్వాస నిశ్వాసములనాదు
నుచ్ఛ్వాస నిశ్వాస మొప్ప నంచు,
తరుణి నీస్వప్న నిద్రా జాగ్రదనుభూతి
నాదు నిద్రాదుల నమపుమనని,
పడంతి! నీహావభావానందముల నాదు
హావభావములు చొప్పుదు నటంచు,
ఉవిద! నీయోగ వియోగములను నాదు
యోగ వియోగంబు లొాదవెదు నని,
మెంచితిని గాని నిట్టూర్పులే విడంగ
నెల్లకాలంబు జాగ్రత్తనే చనంగ
ఎల్లపేర్మిమ భావముననే యింకిపోవ
నెల్లయు వియోగ మగుటయే నెంచనైతి.
బింబాధరోష్ఠ విజృంభణోద్దీప్తికిం
జిలుకల గుంపు లాసించియుండ,
చంపక నాసికాంచల గంధవహసిద్ధి

తుమ్మెదరొద తల దిమ్మవెట్ట,
పల్లవహస్తాగ్రి పరమారుణాసక్తిఁ
గోకిల సంతతుల్ గూయుచుండ,
పద్మపాదయుగ సౌభాగ్య మంజీరాల
నంచలంతంత వెన్నంటుచుండ
మాటల నదల్చి, దుర్నిక్కుల మఱలఁ జేసి
తర్జనముజూపి కాళ్లవిదల్చి చెలువ!
యెందు నీమాట, చూచు నీచూడ్కి యల్ల
నీకరరుహంబు, కలరుతి నే భరింతు. *
కడకంటన్ ననుజూడుమా చెలియ! నీకాఠిన్యతన్ మానుమా
యడుగన్ లేదను టద్ది లోకనుత మర్యాదా యువశ్రేణిలో?
జడమందేనియుఁ జేతనంబు గనుగో సాధ్యంబ, నీలోఁ గటా!
కడువ్యర్థంబుగదా సిత్రార్ద్రసుముఖీకళ్యాణ మాసించుటల్ *
అయినఁబో కాలసాధ్యమగునా? చెలిమోమును కన్ను మోవి సొం
పయిన లలాటమున్ గళము పయ్యెదఁజన్గవ బాహుమూలముం
గయి నడ పల్కు నవ్వు కనుగట్టిన చిత్తరువట్టు ముందఱన్
దయఁగను పట్ట నామనసు దగ్గఱకుంగొని యుగ్గడింపనో?*
ఒకనాఁడు నీకొప్పు నొప్పుల నరయుచు
వెనుపక్క నిలిచి నేఁ బ్రేమగొంటి,
ఒకనాఁడు నీదండ యొప్పుల నరయుచు
కుడిభాగమున నిల్చి కోర్కెగంటి,

ఒకసారి నీ మోము నొప్పుల నరయుచు
నెడమ భాగమునుండి యీపు గొంటి,
నీవు మాత్రము వెనుకకు నీవలావ
ల కెదుటకు నుంతచూడ కూరకయుయుంటి,
చెలువ! మృగశాబ కాదృష్టి తెలిసికూడ!
అంటి నపుడు నే నిన్ నాదు నచ్చుఅవని.*
పంచశరు పంచశరములు
పంచప్రాణములు గొనినఁ బంచత్వంబున్
వంచించుచుంటి నీదగు
నంచిత ప్రేమామృతంబు నాసించుటలో.*
చెలి! నీ చో కాటంపుఁ బలుచాలుతో నవ్వ
వజ్రాల విఱువ యేపాటి తలఁప?
యువతి! నీకెం బాద యుగ్మంబుతోఁ దొవఁ
బగడాల జిగులకే వాసియెంచ?
అతివ! నీ నీలంపుటలకల ముసుపంగ
హరినీలములకు నే గరిమ చూడ?
మెలఁత! నీకొమ్మిన్మంచు మెయి పసిండి మెఱయ
బంగారమునకు నే వన్నె యరయ?
లోకములు నీయువయువ విలోకనంబు
కలిమి యెఱుఁగని నాఁడిష్ట గణుతిగాని
నైజ సౌందర్యవతి! లోల! నవల! బాల!

నగలు గానేరవని—పట్టపగలు నీవు! *
రవ్వంత నీవు గారవము సూపింతువా
కమ్మలజోడు సంగడముదార్తు,
పూసంత నీవు లోనాస గొల్పింతువా
కుతుకంటు ముమ్ముడి సత్తుకు గూర్తు,
కాసంత నీవు నస్ గామించి యుందువా
తారహారము సొంపు తగులు దీర్తు,
నూలుమాత్రము నీవు వీలు జూపింతువా
మొలనూలు కింకిణి యులివు దేర్తు,
రుచిరగండ స్థలాభోగ శుచిని జొక్క,
మంగళగళః పరిష్వంగ మహిమ కలరి,
పీన వక్షోజ యుగళి సంపీడఁ బెనఁగి,
ఘనజఘనపీఠి సముపరికాంతు మొనసి. *
నీమణి కట్టుల పొలుపున
నేమెయిని బసిండి గాజు లెక్క యమరెనో!
నీమెడఁ బడి గురుకుచముల
నా ముత్తెపుహార మెట్లు హావణిల్లెడునో!
తోషణములు రుచిరాంగ వి
శేషణములు సురత సమయశింజిత పునరా
ఘోషణములు సౌందర్యపుఁ
బోషణములు భూషణములు పొలతీ! నీకుసః *

మెడ వెను నగసీల నెడఁ ద్రిప్పకొనలోన
జఱుగఁ బయంటబుజంబునుండి,
బుజముపైఁ బయఁట చప్పన వేసికొనులోన
సడలు నొడ్డాణంబు నడుమునుండి,
నడుము నొడ్డాణంబు నొడిసి నొక్కుడులోన
నెగయుఁ గుచ్చెళ్లంతొ దిగువకుండి,
దిగువకుఁ గుచ్చెళ్లు దీయ వంగెడు లోన
వెలివడు వెనుపట్టి గొనబులన్ని,
కలికి! విఫల ప్రియత్నంబు దలప నీకు
నీవె యఁగుచు నీదగు మెయి దీవదిద్ద
నన్నుఁ బంచుము నొక కనుసన్న లోన
సర్వభూషణాంబరములు జక్కఁ బ్రోతు.*
కనక లసన్మణి ఖచిత భూషణరాశి
సమున్నతి నిడుదీవ శయ్యక్రింద
మొన గగుర్పాటునఁ బొదలి గుబ్బలు ప్రబ్బ
అయిక దాఁ బ్రిదిలినదయి తొలంగు,
అనఁగి పెనఁగిన పరాగంబు సందడిఁదమి
నల్లన నెఱిగొప్పు నలరు లురలు,
అంత చక్కఁగ బెడగారు కోకను గట్టు
చున్న నీపయి నవి యుండఁబోదు,
బాల! నేరవుగాక యపార సౌఖ్య

దాయక రహస్య రతికేళి ధర్మ్రమింత
ఒడలి నొడలి సొబంగులే కడుఁగలసెసు
నితరములు దూరదూరాలె యెంతఁ గొన్న. *
నిద్దపుఁ బ్రాలగచ్చు తెలినిగ్గులు చంద్రికళా ప్రసారతన్
మిద్దెను జల్వగొల్పెడు, సమీర మనోజ్ఞ గవాక్ష కుడ్యమం
దద్దపుబొమ్మలూ_మెఱసి పకాసిడు నాపడకింటిలోన, ఓ
ముద్దియ! నిన్నునెత్తుగడ ముత్తెపుజాలరు హంసతూలిపై
నొద్దికఁ బండఁ జేసికొని యొక్కొకటే నయమారఁ జూపెదన్
చల్లని పిల్లగాలి నలజాయినె యుయ్యాలలూగు నావపైఁ
బల్లెకొలంపు ముద్దియను బజ్జకుజేర్చుక సిగ్గుజోపుచున్
వల్లెయనంగ నుల్లమిడి వక్త్రకళైవతనూ విలాసముం
గొల్లగొనున్ మహీశుఁ డదిగో! విజనస్థలి చాటుమాటుగా.
వచ్చెను సంయమీంద్రుఁడని బత్తి సపర్యలు సేయుచుండఁదా
మచ్చిక వెంచిపెంచి మటుమాయగ మేనటికంపు భావమై
యచ్చపలాక్షి నెవ్విధి నతం డెఱకొంగును బట్టి కౌగిటం
గుచ్చెడునో కనుంగొనుముకొంకక రైవత కాద్రిభద్రుఁడై.*
కనులన్ గాంతకుమూసి యంగభవసంగ్రామంబు గావించుటల్
దన దేశంబునఁ దప్పనట్టి మరియాదంచున్ మనోభీష్ట సా
ధన సంకల్పుఁ డొకండు జవ్వనపు గంధర్వాంగనా రత్నమో
ర్తును జొక్కించెడుకొంటిపొక్కొ హిమవద్దుర్గాటవీస్వర్గమున్ *
వనుల లతాకురంగి సమభావములొప్పఁ బ్రవర్ధమానసూ

వనమును గన్న యొక్క చెలువన్ మునివాటి నికుంజసీమనే
పెనఁగి యొకండు బాయుచును వేఁ్రిలినమర్చెడుముద్దుటుంగరం
బును బిరుదాంకితాక్షరసమూహ నిబద్ధితరాగమాత్రుఁడై *
ఈసునవాసిదక్కి పడకింటను మోమటు వెట్టిపండ, భా
ర్యాసమవర్తినాథుఁడు లతాంత సుమోఘుని గన్నవాఁడాగిన్
జేసెను గోములెన్నో: యవిచేదయి ముద్దియతాఁచె వానిఁబెః
మోసము జేసితంచు, నది ముచ్చటగాఁగొనె నాథుడెంత యో *
కలలోఁ గన్నయువాధ్య చిత్రపట రాగధ్వాంతయై మోస్తతాఁ
గలియన్ నువ్వెళులూరి కార్యఫల సంసిద్ధికై సొరంగంబునన్
జెలునిన్ మాపును జేపు రాఁబనిచి తాస్వేచ్ఛన్ జరింపంగవె
ల్వెలబాఱన్ గొనబైనచెక్కిళులునీలిన్బూనెనంచుల్ వఘుల్ *
చూపుదుఁ జక్కని పటములఁ
జూపుచు నెఱిఁగింతు వానిచోద్యపు గతలన్
నాపజ్జ నీవు కూర్చుని
యోపిక నాలింతువేని యుగ్మలి! యింకన్ *
గంగ నెఱుఁగవె, హిమవదోత్తుంగ భంగ
సంగత మృదంగ గామిని, కదలి వెడలె
బ్రహ్మసభకొక్క నాఁడొక్క పనిఁదలంచి,
కోకగట్టిగఁ గట్టిన కొామి రెమిన్న
వేసమునుదాల్చి యెంతో యుల్లాసముగను.
పైకిఁ బోవునప్పుడు చెలికోక కట్టు

సుంత చెదరంగ లేదంట, సుదతి తిరిగి
క్రిందకు డిగెడు సమయాన రేగెనంట
కురులు, చెదరినదట కోక, కరువలికిని,
ఉవిద యూరుమూల మపుడు యువకుఁ డొకఁడు
నృపుడు చూచినవాడంట నెమ్మి గదుర,
నవ్వెదో చెలి! నిజముసూ! నవ్వు! నవ్వు!
మేనక నెఱుఁగుదే యాపె మేదినికిని
డిగిన దొకసారి దివినుండి, లేమకట్టు
బెట్టుసెడలేదు రవ్వంత విను తెలివున,
భూమిపై కేగుదెంచిన దామె, చక్క-
నాట్యమాడింది మంజీర నాద మమర,
ముంచి తేల్చింది మోహాన మునివరునొరు
నెగసి పోయింది, కాని యాయింతి కట్టు
బెట్టుసెడలేదు రవ్వంత విను తెలివున. *
ఒకనాఁడాదిమ విష్ణువొక్క-పనికై యూహించియూహించితా,
నొకచొక్కించెడునాడుఁరూపమును నెంతోజక్క-ఁదాల్చెన్ శివుం
డకటా! మాయయటంచుదానిదెలియంగాలేకవెన్నాడెనం
ట కురంగీకరిణీ ఘలీ నికరముల్ లజ్జన్ వనిన్ డాగగా. *
మల్లిక మొగ్గవోసినది మావులు గాయలుగాసె మాలతీ
వల్లరి మాధవుం బెనఁగి పైకొనుచున్నది పైరుగాలిలో,
పుల్ల సరోజనేత్రి! వనభూములు చైత్రుఁడు సొచ్చినాఁడు రం

జిల్లి పికంబు గూసెడిని చొక్కొట పిట్టయి మాఱుమ్రోయగా.
సారసగంధి!పుష్పశరసాధన దర్పుఁడు కొంటెచూపు డ
మ్మారుని నేస్తుఁ డమ్మధుఁడు, మానరునిన్నలయింప,రమ్మునన్
జేరి సుఖింపు పుష్పమధుసేవన తుందిల భృంగబృంద వం
దారు సరోజషండపరిమదంబగు బొడ్డనబావియొడ్డునన్. *
చిఱుచెమ్మటలు గ్రమ్మి చెలువ! నీయద్దాలు
కసుమాలమును జూపు మిసిమిదక్కి,
ఉక్కపోతనుబడి యువతి! నీచక్రాలు
తెక్కలార్పుచు వెడ నిక్కిసూచు,
తడియాఱినట్టిదై పడఁతి! నీ సుధ చిమ్మ
ఎడ నీటికేమొ దప్పిక వహించు,
సుడిగాడుపునఁ బడి సుదతి! నీతీవియ
వసివాడియున్నది బిసబిస చెడి,
మందమలయానిలకిశోర బృందములను
నల్లలితమగు నిర్ఝరి నోర్మి గమిని
నిరుపురము గూడి జలకేళి నింపొనర్త
మేల సంకోచమానెదో యింతికాన!
తొలుదొలుత నరాంఘ్రితోయజాబుల నిఁపు,
అటుపైని జంఘు సస్యంపు ముంపు,
ఆమీద నూరు రంభాధారముల కట్టు
పిదపను నాభిసుహ్రదపు సుడులు,

హిమ స్ఫుట వళితరంగము స్మల యలజడి
యంత కుచాద్రి మహాభరంబు,
వెనుక కంధరశంఖ విజయరేఖలమోత్ర,
పైని శిరోజ శైవలపుఁ గప్పు,
క్రమముగను గొల్చి కాసార క్రమనీర
ములను మునిగీఁత నీవీఁద చెలువ! నేను
నీకదృశ్యుండనై మున్గి వే కవుంగి
లిచ్చువాఁడను తెలియని మచ్చుమెచ్చ. *
బోఁటను నీఁదువేళ పరిఫుల్ల సరోజదళాయతాక్షి! నీ
చారుపయోధరాద్రియుగ సంపదముంచి నితంబసైకతా
పారము చూపుచుందు వది భావనసేయుదు భార మేదయున్
నీరము దిప్పవేయుతన నీరసవృత్తినె చూపె గాకనన్ *
వసనంబు దడిని హత్తుచు
ముసిముసి నగవులను తీరమున కెక్కెడులో
విసవిసనేఁగొల్లాడనె
పస నీనిమ్నోన్నతములు పట్టిచ్చు తమిన్. *
పావడదాల్చి సందెట సెబాసనవచ్చు శిరోజపాళి నెం
తే వడిపెట్టి యార్చి చిక దీయుచుఁ దీరమునందు నవ్వుచో
నీవలరింతుగా బాడవు నిల్వున నల్లని మాలు జీబుతోఁ
బూవులు బూయునట్టిసురపొన్న విధానముదంబు గూర్చుచున్ *
ఎండ యసహ్యమయ్యెఁ జెలి! యేచెడుగ్రీష్మము వేడిగాడ్పులన్

గొండొక యల్లిబిల్లి నెఱికోన నికుంజమునందుఁ జల్లగా
నొండొరులన్ గ్రహింపఁగల యూసుల వేసరకాడుకొంచుమా
చండతరంపు టప్పగటి జాములు పుత్తుము చిక్కులై చనన్ *
రేలను భీతి లేదు వెలలించును సంద్రము చల్లగాలి, నీ
లాలక! మంచిగందము నలందుక చల్లని మల్లెసెజ్జపై
బాళిఁ జెలంగఁ బండుకొనఁ బట్టును నిద్దుర తప్పకుండ నే
వేళకొ మంచు పాటుననొ విస్మృతినో విజనాను భూతినో. *
ఆరుబయట విహారం
బారమణీయ నిశియందు ననుభోగ్యమహా
నారీమణి! చిఱుచెమ్మట
లారుచుఁ బోయుదును గ్రొత్తయార్ద్రితఁ గూర్పన్. *
అనుకొనకుండఁబట్టునొకయందపు మబ్బొకమూల తెల్లవాఱుగా
మునఁజినుకుల్ కనుంగవను ముంచును జేల్చును జల్లఁజల్ల, వా
నని యదినేరకే మనము నర్మములాడుచుఁ బుత్తుమెన్నిమో.
దినములదెప్పుడో తెలియఁదెప్పున శ్రావణమాసముంచునుప్ *
అగుమనంచు పయోధరాభి ధానముఁ బూనఁ
గనునె కర్కశకుచ గౌరవమ్ము?
మించుచంచలనంచు మిన్నంది మెఱసిన
జలుపునె రుచిరాంగ సౌష్ఠవమ్ము?
గగన భావి నటంచుఁ గడ లావరించినఁ
జాటునే గుప్పిలిః చాటుదనము?

రాజుతో నోరసి నే రాజిల్లుదు ననిన
నలరు నే నెఱీ సుదనాభి దీప్తి?
మేఘ మాకొండ చఱియల మెలఁగుఁగాక
మెఱపులను జీకటులఁ జూపి విఱచుగాక,
నాకసంబున నుఱిమెడు గాక, తఱిమి
పౌర్ణమిని గ్రిమ్ముకొనుగాక పడఁతిమిన్న!*
వర్షమునగడుగుకొనిబల్ హర్షంబుననకులుబొట్టునద్దుక తాన్వో
త్కర్షను శశిఁ జూపెడు దు
ర్ధర్షంబగుఁ నోసి యుత్పలాక్షిరో! కంటే *
శారద రాత్రులం బొదలు చక్కనియామము లెన్నొ చానరో!
సారసమంచ వెన్నెల ప్రశస్తపుఁ గూటమిఁ దెల్పు నిల్పఁ గం
సారము దెల్లదుప్పటి పసందున నొప్పెడుఁ జిన్ని భంగముల్
చారుచకోర దంపతుల సందడి దందడిఁబడ్డ ముద్దులై. *
నీదగు నగ్నవలగ్నము
సాదరమతిఁ జూపఁ దలఁతొ చక్కని చుక్కా!
కాదన కూనఁగఁ దగు శా
తోదరమునఁ దోయదంపుఁ దునుక నెదేనిన్.
ఏదే నష్టంబుండినఁ
బోఁదగునది కాదె సిగ్గు పొలఁతుల కొకచో?
లేదా వెన్నెలయే తా
నాదట దువ్వలువ చలువదై యలరించుఁ. *

నీమెయి జాళువాపసిమి, నిద్దపు వెన్నెల నిగ్గునందు, చూ
పోముచు, నిన్న హెూ! కరగిపోసిన చిత్తరువట్లు నిల్పు-రం
భా, మఱి, మేనకా,మఱి,సెబాసనఁగాఁదగుకొత్తయచ్చరా?
తామఱపించు నీ జగము లన్నిటినంచు దలంపగాఁ దమిన్. *
కన్నెలు కదలుదు రంతకు
నన్నెలలో నట్లతద్దియని, యల వెన్నెలలన్
నిన్నొ కదలఁగనీయను
వెన్నెలనే నిలుతు కాక విభ్రాంతియొకో!
ఆడెదువీవు వెన్‌జడ నడాడఁగ పావడగాళ్లు దొక్కఁదో
స్నీడ నిలంబడంగ నిను నే వెనుబాటునె కూడముట్టి నీ
జాడనెఱింగి నేఁడుగద చక్కని స్వేచ్ఛయటంచుఁ గుల్కఁగా;
వీడెదె వీడదే చెలువ! వీడెదవే? జతగాని నొంటిగా— *
ఎంతలో మాఱినది ఋతు, వొంతలోన
మంచు గురియుచునున్నది మాపులంట;
చెట్లయాకులు రాలెడు తట్లకొలఁది
ఆకులేదు పూవు గన మయూరె! సుంత— *
నీరము మాత్రమే మిగులనిద్దము శుద్ధమునై ప్రవాహ సం
చారము సేయుచున్న దల జాహ్నవినిన్ మన గౌతమీనదిన్;
తీరములందుఁ బచ్చికలు తిన్నని తోవల జూపుచున్న వం
తే-రమణీమణీ! మనసు కెక్కిన చో విహరింప రానగున్. *
మఱియొకటి కలదుసూ వింత, మాపులందుఁ

జుక్క లతి శుభ్రముగఁ గాంతిఁ జొక్కనింగి;
భూమిపైనుండి వానినిఁ బోల్చి మనము
చూతుమా గడచు ఘడియ సూక్ష్మముగను.
అవ్వియున్న వే యల యుడు లంబుజాక్షి!
మనల కనులలోఁ దమవగు కనులు జొనిపి
చూచునట్లుగఁ జూచునుఁ జూడఁ జూడ
బందుగుఁ కంటె దగ్గఱపడుచు బయల. *
చిన్నదిసుమ నేఁ దొలిఁగనుఁ.
గొన్నదియని యనునంతఁ గొప్పనరయుదొ దా
నిన్నెఱిఁగని యీసూనుదో—
మన్నింపరుగాదె మాట మగువ లోకాలోకచో. *
ఏండ్ల కేండ్లు ఋతువుల నింపు గడపి
కాలమానంబు మఱతుము కలికి కాన!
కాలమానంబు మఱచిన నేలు మనల
చిరతరాయుస్సు పరుల యాశీస్సు లేకె. *
ఈనిశి చాల చీకటయి యిట్టులనూ తనచీకటిన్ మహీ
జానిని నొంటి నూచునది చల్లనిగాలికి రివ్వు రివ్వు-రా
వౌ నది తోచకున్నదొక యందము చందము కంటఁజూడఁ గా
నీ, నినదంబు వీనుల కహీన ముదం బొదవించుచున్న దో
సీ! నయనాలు మూసిన నదే తెఱగొప్పుచునుండు వింత! రా
తీ్రినినదంబునందుఁ గల దెంతయొ సొంపొగి రమ్మురమ్మ, వే

వే నిబిడాంధకారమున నెక్కడిదానవు నీవు వచ్చి తం
చేను బహూకరించుచును నింపుగ నీనడ నాలకింతు — లే
వే? నిబిడాంధకార మెాయి దెల్లనుమాయు రె!మాయ యేకటా!*
భ్రాంతియందున మధురంపుభావశాంత
మంతగా నుండుననుచుఁ దలంపకిట్టె
భ్రాంతి నెడ బాసితిని, దెల్లవాఱినయది
వెలుగు వచ్చెను ఘననభో వీథినుండి;
ప్రతిపదార్థంబు దివ్యప్రభావమునను
దోఁచునట్టిది: యీతోట పూచినట్టి
పూలు నీమేని మెత్తనఁ గ్రాలు నహహా!
ఏది నిను బోల దీ భువి నింతికాన!
ఈసమస్తంబు నీయదియే యగును ఈ
కాని యొక్కటి నీవు కా వోః నెలంత!
వెలుఁగు వేళను నీకయి వెదుకవలసి
వచ్చునట్టిదిగాఁ దోఁచుఁ, బ్రాంతియె యది?
నీ శరీరంబు నవకంబు నీశరీర
సౌష్ఠవము నెంచ నొకకొంత చక్కఁదనము
నీదు భావంబు దలపోత మోదమునను
కొంత చక్కఁదనంబును గుమురు వడిమె. *
కన్నులు తెఱచుక చూతును
కన్నులు మూసికొని నిన్నుఁ గలలోఁ గాంతున్.

ఎన్నఁడుగా నిద్దురలో
నున్నదాన వీవెయుంచు నుదయమె లేవన్. *
తీయమె పువ్వుతేనియలతీయమె చక్కెఱతీయమే సదా
హ్యాయమె నీదుసంగడము, ప్రాయము చేత నెయంచు నెంచకా
మ్నాయపుఁ బల్కు సేతనని యాడకు: మానసమందు నీవు నే
నేయని నేను నీవని కనీనిక సంజ్ఞలఁ జేసికొన్నతఱి
న్యాయమటంచుఁ జాటుమి యనారతమున్ మన జీవితంబులఱ
ఆకనుసన్న లో చెలువ! యంసయుగంబుకు ఱెక్కలిచ్చె: లో
నాకలిదీర్చె దప్పిక నడంచెను నమ్మము నాదు మాట య
య్యాకసమంతయున్ మహియిదంతయునాకనుసన్న చూడ్కిలో
సోకయి తోఁచునట్టిదిఁకఁజొక్కుడుచున్నది చిత్రమే యొ హా!
గాలిపటంబు భాతినోఁఅగఁ నను దారముచేత నూచి నీ
లీలగ నిల్పికొమ్మ: నను లేబరపుంబురి జాఁఅనీకు నీ
యేలిక సామినై పయికి నేనెగయుంగను నన్ను నేలుకో
నూలున లాగిపట్టి యొక నూతన నృత్యము దానఁ గూర్చుకో*
మన శరీరంబు లపుడు కనబడ వొక
రి కొకరికిఁ గాని గాలిలో రింపురింపు
వలయములు గొట్టుకొను రుతి యలర సేయు,
నదియు నొకకొంతదవ్వుమాత్రంబొ యేమొ?
గాలియుండెడు తెఱవును గడచను నెడ
శాంతిగనుచుందు నిర్మలశాంతి నేను.

నీవు నియతిని గనుచుండు భావసుత,
చూడఁ బోయిద్దఱము మనజాడ లింక.
దారమది సన్నసన్నగ దఱుముసంతె
నేసువ మొక ల్లొకళ్లము, పారువమటు
బఱగుచుండును కళ్యాణి! పట్టపగలు:
రాత్రిలందున వెన్నెల రహిఁ గలియును.
ఆఁ! అలచివర దారము నంత యింత
నింక విప్పచునునావ? యింతి! నీవు!
నీదు సంతోష మతిరమణీయము మఱి
చక్కఁగా నేను గానగు కోరికా యది!
సెలవు! సెలవు! శుభాంగిరో! సెలవు! సెలవు!
వింతగాఁ దోఁచునదె నీకు; సుంతయెముట
లేని నీనుండి సెలవు నీకిఁతి గొనుట;
సెలవు! సెలవు! శుభాంగిరో! సెలవు! సెలవు!
సెలవు! సెలవు! శుభాంగిరో! సెలవు! సెలవు!
వింతగాఁ దోఁచునదియె కట్టెమటనున్న
యట్టి నీనుండి సెలవు నేఁబట్టి గొనుట
సెలవు! సెలవు! శుభాంగిరో! సెలవు! సెలవు!
నాదుపల్కు లసంబద్ధ నాదములుగ
దోఁచునట్టివి పో! నీకు-దోఁచరాదు.
రూపమది చంచలంబును లోపముగల

దర్మిలియొ నిత్తె మెప్పుడు నాడుముందు.
అల్లరూపంబు నుండియు నల్ల నిత్య
మైన యర్మిలి నుండియు నడుగుదు నెల
వేదియునుగూడ నొంటక దో! మృగవిలోల
నేత్రి! అందువో యుభయముల్ నిత్తెములని *
నిజము! నిజంబు! సాధువగు నీవచనంబది కోమలీమణీ!
సృజన మొనర్చి రూపమిడి చిత్తము నందిడి తోడునీడగా
బుజుపణిం బ్రేమముట్టిపడ రూపము రూపమునం గదించి య
య్యాజుడు సమేలవేళ యిడ నయ్యది యూరక రిత్తవోవునే?
మనల సమస్తమున్ జగతి మాన్యము నిత్యము సత్యవాదస
మ్మననము మాయలేదిచట మర్మములేదు వితర్క మింతయున్
గనవల దర్కచంద్రులను గన్బడు కాలము హాయిగా నొక
ళ్లను నొకరెంచికొంచు నెలయింతముఁ తన్మయదీప్తిగుప్తతన్. *
అదియే మంగళహారతి
యదియే మనయవధి యదియె యాంత్మకు శమనం
బదియే కలకాలము మన
యెదుటనండు కలిమి బలిమి హృదయేశ్వరి! రా!
నశరీర వతిగం జూచియు
వశమటినే భావవీథి విస్ఫుటరూప
ప్రశస్తిం దలపోయుచు, నటి
వశమట వాంఛింతు నీదు బాహులతికలన్. *

భ్రమయదియంచు నేఁదలప భాగ్యమటంచును నెంతు నీమక
న్నోమగవ నానోసల్ బనిచి పోడిమి వ్రాతల నొత్తుకొందు,వ
క్రిమతరమౌనుగాక తిలకంబది, చెమ్మటజాతి సెద్దఁగ
మ్రిముగవ సుందరానన సులక్షణ శోభనుదిద్ది ముద్దిడన్ *
భావసంక్షోభమునఁ బరిభావమనక
లిపి లిఖించితి నిద్రాక, లేమిఁగామి
లోకుఁ లనుకొన్ననేమి; యశోకసూక్తి
సుందరతమాంగి వైతి వో! సుందరాంగి! *

## 14 నశింపులు.

ఉత్సాహమ్ముజవమ్ముగూర్పఁగనుముందుస్ మార్గదర్శిన్ద్వరన్
వత్సా! యెక్కుమటంచు హెచ్చరిక గోల్పన్ సంజకాకుండ శ
శ్వత్సంబుద్ధ సరోజినీ సలిల హాసాభాస భృంగావళీ
సత్సాంగత్య విశేషితంబయిన తచ్చెలమ్ము మేమెక్కుచున్.*
అహాహా! నల్లడలందు మబ్బులకుఁ బ్రాపైనిల్చు తుంగాద్రులే
గహనారణ్యఝరీప్రవాహముల కే కాంతంబులౌ లోయలే
మహిదిజమ్మండలి రేఖకుస్ డిగిచి కంటన్ దాటు మాన్యంబులే
విహరింపస్ దగునెత్తమే యనుచునుస్ వీఁకస్ జుట్టుచూపానులో*
ఆయెడఁ గూడవచ్చిన వయస్యుఁ డిదెల్లను పూర్వభూపతుల్
జేయి తెమల్చి నట్టిది యిసీ! యిపుడివ్విధి బీడువాలెనం
చాయతమైన యూర్పువిడె, నాక్షణమందునె నామనంబు భూ

తాయున గామినియై చనెను: ఆపథిఁ జూపెడు గోపవత్సయున్*
మా కెలుక వడక కుప్రింకుచుఁ
జీఁకును మిగిలించి తొగరు జిగి నడగెడు సూ
ర్యాకృతిఁ జూపించుచు "వేఁ
జీఁకటిపడెడు దిగవలయు శీఘ్రము" యనియెన్ *
ఏటికోరి! తొంద జీఁక నొక్క నిముసంబు
దీని సొబగు లరసి దిగుదమన్న,
పులులు వచ్చు నియది పూర్వమురాయలు
వేటలాడుకొనెడు విపిన మనియె. *
సరి!పో! ఇప్పుడుకూడ వచ్చునె యన్న "సాయంతనంబైన చో
జెలువందున్ జలమానవచ్చు మనకున్ జే గత్తియేన్ లేదుగా,
చురకత్తిం బొడువంగఁ గోర్ల్పులి తుత్రిటిన్ శోషిల్లి ప్రాణంబుల
వ్వర రాజన్యుల పాలుసేసెడిద టాబాగున్న కాలంబులన్. *
అనుచుఁ దెల్పనఁ దెల్పుమీ యాలసింప
మింక నేమైన నీస్థలామృతచరిత్ర
మంటి, నెల్లనుగల విప్ప డానవాళ్లు
మునుపటి వటంచుఁ దలపోసి ముచ్చటింప. *
అని బదులు వలికి నడచుచు
ఘనగిరి పార్శ్వంబునందుఁ గట్టిన బురుజుల్
మొనసిన యొక వప్రంబును
కనుడంచును జూపె నేమి కట్టడములనన్. *

క్రిందఁ గనఁగనయ్యెఁగద లీలగ వేఱు సరోవరంబు, నా
ముందునె మందిరంబు, నొకమూలగ నంతిపురంబు, దాపునన్
మందులకొట్లు కొంచెమటు నూవులశాలలు, సైన్యవాటికల్
కందకముల్ బ్రసిద్ధమగు క్షత్రియదుర్గము నేఁడు గంటినా సే*

చారిత్రపుఁ గాంతిని గం
భీరత విలసిల్లె విజయనృపుల నగర మౌ
రా! రాయలపుర మదిపో
నారాష్ట్రము చెదరి యందునందు మిగులుటన్ *

ఏనాఁడు బుట్టినదో మన
మీనాఁడునఁ గనెడు కోట, యింతటు నెల్లన్
బో నశియింపులె సత్కృతులను
చానగముల్ దిగుచు గొల్లనని పితిమి వడిన్.*

అచల ప్రికాశాన నవఘుళించెడు రిక్క-
వ్రాలుచు గాఢాంధరాశి మిగులు,
గతిమీఱి పొంగిన ఘననదీ మార్గంబు
జలమెండి యిసుక మేటలను మిగులు,
జంతుసంతానంబు సంచరించెడువని
తుదిముట్ట బొగ్గు బూడిదల మిగులు,
కీర్తివంతులు రాజమూర్తులు పాడ్వడఁ
బట్టణపు నశింపు లిట్టు మిగులు
భావికాలంబునకుఁ బురాభావమగుచు

వరలు తమతమ చారిత్ర వర్తనములు
సూచనము సేయగనటంచుఁ జోటునెడఁద
మెచ్చుకొనుచును వ్రాసితి మిత్రుశోఁడ. *

## 15 బొమ్మల నగలు.

* "బొమ్మల నగలమ్మ బొమ్మలనగలు
చందనపుం బొమ్మ కందమౌ నగలు." *
చిన్నపిల్ల కమల విన్నట్టి యాకేకఁ
గాలిగజ్జెలట్టె ఘల్లుమనఁగ
గడపదాఁటి యొక్కగంతున వీథికి
పరుగుదెంచి యమ్మయనుచుఁ బిలచె.
కమల తనదు చంక కమరిన బొమరాయి
నెత్తిచూపి దీని కీవు జోడు
నగల నీయుమంచు సొగసుగఁ బెట్టుమం
పలుకఁ జొచ్చె ముద్దుతడఁబడు నుడి.
పాలనిచ్చి నేను లాలిని గుడుపుదు
జోలఁబాడి నిదురఁ జొక్కఁజేతు
నగలుపెట్టి పెండ్లినయముగఁ జేతునం
పలుకఁజొచ్చె ముద్దుతడఁబడునుడి.
చెవులు లేనిదేమి చెవిపోగు లమ్మాయి!
ముక్కు లేనిదె నత్తు నెక్కిడిదుము?

చందనంపుబొమ్మ కందంపు నగలివి
వట్టిరాతి కెట్లు పెట్టుదనక,
అమ్మకొనెను నమ్మి బొమ్మల నగజత
కమల కిచ్చి చనియె కమల వానిఁ
జేతఁబట్టుకొంచుఁ జిన్నటి నగవుతో
లోని కరిగెఁ దల్లి వానిఁ గనుచు—
చెవులు లేనిదేమి చెవిపోగు లమ్మాయి!
ముక్కు లేందె నత్తు నెక్కడిడుదు?
చందనంపుబొమ్మ కందంపు నగలివి
వట్టిరాతి కెట్టు పెట్టునదు.
పిల్లతాను నగల నుల్లసిల్లెడు నెడఁ
దలఁప దింతయైన దాని వితము:
కమలచంక గుండ్రబొమరాయి యటులుండె,
కొన్నినగలు కొన్ని కులుకునుండె.
బొమ్మ కన్నినగలు "బువ" తిని యుంతునం
చమ్మయన్నఁ గమల యదియె నమ్మె.
నమ్మె చెండవేళ నమ్మకై నిసురించు
నెవ్వరనఁగ నేర రెవ్వరందు?
చెవులులేని రాతి కివియేడ చెవిపోగు
లెక్కడిడుట నత్తు ముక్కిడిశిలఁ;
జందనంపుబొమ్మ కందంబులగు నగ

లుత్త అప్పకెట్టులుంచుటా మఱి?
ఇంటి వెలిసెకాంతి నింపుగ నిదురించు
కమలమోము నిండెఁ జెమటకాలను,
చందనంపుబొమ్మ కందమా నగలూని
చెవులు ముక్కులేని చిన్నరాయి
కానుపించెఁ గమల కనుఁదోగ మూతలో
వెలసినట్టి చిట్టికలనుఁ గలను.

## 16 జన్మస్థాన సంస్తవము.

"ఏమి విశేష మీయెడల నెక్కుడుగా విలసిల్లు చుండునో
వేమఱు జూడఁగోరుదును వింతగ నొతుము విశ్రమింతు మెం
తో ముదమార యీజన పదోద్భవ సీమల నో సహోదరా!
నీమది కెట్లుతో చెడిని నీకును నట్టులె తోఁపకుండునే." *
"తమ్ముఁడా! నాకు నట్టులె తలఁచుఁదోఁచు
నన్యథా యెట్లు? జన్మంబునందిలిమిగ
యిరువుర మొక స్థలంబున నెందునున్న,
నిందుపొందెడు నానంద మందనేర. *
శుభ్రాంశువును తలఁజూపెడు నాకొండ
పొడుపు గుబ్బలితీరు పొదలుచుండె,
అరుణ ప్రపాతంబు నలరారు నావల
కురింకు మెట్టపగిదిఁ గొఱలుచుండె,

గిరిజామలత్వంబు బఱగెడు నా మెట్ట
వెలిశిప్ప పోలిక వెలయుచుండె,
కడనెంతొ పొడవుగఁ గనబడు నాపజ్తి
చుట్టుగొండ సరణి చూపుచుండె,
వానినెల్ల నిరీక్షింప వరలు నిద్ది
తనరు గట్టులఁజేని విధాన నొహహొహొ!
ధరను నెచ్చోటనైనను దారసిలునె
యిట్టి వరధరాధర రాజి యెన్నఁడేని. *

అల రాజహంసయుగళిని
విలసిల్లెడు సుమసువర్ణ విభవముతోడన్
దులదూఁగెడు మన కొలనిన్
దఃపోయరె మానసహ్రదంబని కనుచో. *

మనలపొంకె నెలమి జనకుఁడు నాటిన
యల్లలేయనంట్లు నంటుమామి
డులను నెసఁగు తోట చెలువంబు దిలకింప
నందనోపవనము నాఁ జెలంగు. *

జననీ పయోధ రార్పిత
ఘన సుధ లనఁగన్ స్రవించుఁ గాదే యిచ్చో
జనపద భూధరభవ ఝుర
గణజలములు పైరులెల్ల కడు ఫలియింపన్. *

మిన్నునఁ బడు జలమొకటై

యున్నతపథినుండి జాఱి యుర్వి నినుఁకు నీ
సన్నుతమగు జలపాతం
బెన్నఁగ మిన్నుఱుతీరు నేర్పడియెనుఁ జూ *
అదిగో! కక్కయయింటికేగెను సంధ్యారాగముక్రమా సెదఁ
ముదమేపారఁగ నొక్కసారి గరువుస్ ముక్కల్లుకొండస్వనిస్
బద! వేవేగమె చూచుకొంచు మది సంభావించుకొం చింటి కా
హ్రిద తీరంబునె యేగువారలము రమ్యంబౌను సంచారముః *
కనఁజూపుమేఱి పచ్చని చేల నీక్షించు
రయితుఁకది సువర్ణమ్ము సుమ్ము
తలసత్తు కొలఁదిని నిలిచెను గిరినెంచు
ఘనవనంబుల కది కట్టు సుమ్ము
వినఁగల్గు వఱకు వేసిన యీల నాలించు
మొదవుల కది వంశపూర్తి సుమ్ము
చేసాచుదాఁకను జిక్క ఫలములందు
కో, కొమ్మలకు నది గొప్పసుమ్ము
పూవులను గాయలను నొప్పుతీవె కనుము
ప్రాఁకముందుండి యలరెడు పామసుమ్ము
వలపులఁ బిసాళించు చంపకము నరయు
నిడుఁపుఁ గొముల సారంగంబునీడ సుమ్ము*
ఇంక గట్టు సరిగ నెక్కుచుండఁగ గాలి
సోకుచుండె లలిత సూక్ష్మ వీచి

నీతమగుచు; మలయపోత మయ్యది సూవె
చల్లదనమును వెదజల్లుచుండి. *
దరిలేని మున్నీటి నరయుద మనుకొన్న
స్వాదుపానీయ రసంబుగాదు,
స్వాదుతరంగిణిస్ బ్రిణుతింత మనుకొన్న
వలపించు నలరుల పట్టుకాదు,
అలరు బొద్దనబావి తలపోతమనుకొన్న
నీటిపక్షులు నిల్చు చోటు కాదు,
ఒగి నీటి పక్షుల యుత్థానమనుకొన్న
దోనె తోరిపుడులకుఁ దోవకాదు,
తమ్ముఁడా! కాంచితే యీహ్రదంపుతీరొ
మంచి నీటను పూవులఁ గొంచతతుల
దోనెలను నొప్పుగట్టులు తొలఁగ పొఱలుఁ,
బొఱు, మెట్లను మెఱకలఁ బఱఁగు నౌర! *
అనుజ! నాదుమాట లతిశయోక్తులు గావు
ఇందు జన్మ మెవ్వ రందు వారొ
వారు తప్ప కెంచువారలు మనవలెఁ
బ్రకృతి భావముగుచుఁ బఱఁగు నిద్ది." *

## 17 కడలి కన్నియలు.

"అమ్యో! ఏమి రాతిరంతయు నీవింక

నింక వత్తువనుచు నిచట దరిని
వేచియుంటి; నన్ను విడిచి పుచ్చెదనంచుఁ
బలుకుచుంటివేమి పాపమయ్య!
పల్లెయదిగో! మనల యిల్లు కానఁబడెను
పిల్లలరుగో! నీవు తెల్లవాఱ
వత్తువనుచుఁ జూడ వచ్చుచునుండిరి
బుట్టలూని, రట్టు పెట్టనగునె?"
"వనిత! పట్టుకొనకు వదలుము నీవింక
వలదు వలదు ముందు నిలువఁ దగవు."
"ఎట్టి కారణంబొ యెందుల కేగెదో
యాలి కెఱుఁగ పఱచి యరుగఁ దగదె"
"చెప్పనెడల నన్నుఁ దప్పక విడుతువే
వేయి చేతిలోనఁ జేయి నిపుడు"
"విడువ కేమి సేతు వెడలెద నన్నచో
జఱిగియుండు రాత్రిఁ జాలవింత"
"పొలఁతి! నిన్ననల్ల పొద్దుగుంకెడు వేళ
నిందు నిలిచియుండ నెగసి పడియెఁ
బెద్దచేప యొకటి వెంటనే తెప్పను
వైచుకొనుచుఁ బోతి, వైళముగను
వలలఁ బన్ని నాఁడ వలలఁ దీసినవాఁడ
కాని దాని నెందుఁ గాననైతి.

నింతలోన రాత్రి హెచ్చయిపోయెను
నల్లచీకటియును నల్లుకొనియె.
త్రోవఁ దప్పిపోతిఁ, దోడెవ్వరును లేరు
గొప్పగాలికూడ కొట్టఁ దొడఁగె
తీరమునకు నింకఁ జేరనేర నటన్న
దిగులుపుట్టె: నంత దిక్కులరయఁ
దూర్పు సంద్రమందుఁ దొగలఱేఁ డుదయించి
యంతకంత కంత కధిక మగుచుఁ
దనదు వెల్లడాలు వననిధిఁ బఱపుచుఁ
దెఱవు చూపెనొక్క ద్వీపమునకు.
తెప్పనటకుఁ జేర్చి తెరచాప మడచుచు
మెత్త నిసుకపైని నత్తమిల్లఁ
గూర్చి పండుకొంటిఁ గొండొక సేపుప
కట్టె రెండు జాములయ్యె మాపు.
వీచుగాలి యడఁగె వినఁబడ వలలును
చందురుం డొకండు సల్లగాను
మింటఁ జూచుచుండె మేటి యద్దీవిపై
నేను జూచుచుంటి నిదుర రాక. *
ఇంతలోన నేమి చెప్పుదు నెచటనుండి వచ్చిరో
కాంత లహహా! వేలకొలఁదిఁ గన్నె లనఁగవచ్చుఁ జూ
గంతులిడిరి చుట్టు కాళ్ళగజ్జెలల్ల మ్రోయఁగా

వింత పాటఁ బాడినారు వినఁ బడియెడు నిమ్యేడస్. *
ఒక్కపడుచు వచ్చి నొక్కెను నాబుగ్గ
నొక్క వెలఁది పలికెఁ జిక్కితివని
యొక్క కన్నె పొగడెఁ జక్కదనంబును
నొక్క కులుకులాడి ప్రక్కఁ బండె.
వారి నెరులనుండి పడుచుండె బిందువుల్
వారి మేనిచాయ వానమబ్బు
వారి గూడియున్న భాగ్యంబె భాగ్యంబు
వారి నెమకవలయు వసుధనెల్ల.
వేగుచుక్క పొడుచు వేళకు వారలు
వడిగ మాయమైరి వనధిఁ బడుచు
మునిఁగి యీఁదిరైనఁ గనవలె వారిని
నాగలోకమందు డాగియున్న."
"అయ్యొ! నాథ! నిన్ను నావహించెనుఁ బోలు
కడలి కన్నె రాత్రిఁ గడలిపైని."
అనుచు నాడుకొనుచు నరిగెను గుడిసెకుఁ
బల్లె జంట చుట్టు ప్రజలు మూగ.
భార్యయంత నొక్క పసుపుముద్దను దెచ్చి
దృష్టితీసి మగని తీరు సూచి
లోపలికిని గొంచు దాపున నిలిచిన
చెలుల కెల్లఱకును దెలిపె నిట్లు

"పతులనింక మనము వదలఁగ రాదమ్మ
రాత్రులందు నెంతమాత్రమేని
విడిచిపుత్తు మెుక్కొ కడలి కన్నియలకుఁ
జిక్కి యక్కటకట సుద్రిక్కుచుందు." *

## 18

## శైశవము.

తొమ్మిదినెలలు మోసిన యమ్మచేతఁ
బెంచఁబడిన శైశవము! నీవింతకంత
తోఁచి తోఁచని గతి జ్ఞప్తిఁ దోఁచుచుంటి
వామె యాబ్దిక దినము నేఁడగుట నేమొ.
కేరుమని మంచమున నేడ్వఁ గేలఁదీసి
యక్కునను జేర్చి యేటికి? అన్న! యనుచు
లాలనముసేసి కడుపారఁ బాలనిచ్చి
ముదమెలర్ప నిన్ను నిదురఁ బుచ్చియుండు.
పొద్దునను వేడినీళ్ళను బోసి యార్చి
చమురునను జిట్టి యొడలిని నిమురుచుండ
నీవు చిరునవ్వు నవ్వఁగ నిన్నుఁ జూచి
మెచ్చుకొనుచును గడు సంతసించియుండు.
రాత్రి నెపుడైన నీవు మూరాముపెట్టఁ
జంక నిడుకొని వెన్నెల చలువలందు
చందమామను దాయిదాయందమనుచుఁ

బేర్మి గోరుముద్దల దినిపించి యుందు.
కాలి చిరుగజ్జియలు ఘల్లుఘల్లు మనఁగఁ
బడుచు లేచుచు వడివడి నడచుచుండ
దిద్దుచును లేవ నెత్తుక ముద్దులాడి
యప్ప నాన్న బామ్మను నుడుల్ సెప్పియుందు.
ఇరుగు పొరుగు పిల్లలఁగూడి యింపుగులుక
నాడుకొనుచును దుదకుఁ బోరాడి యింటి
కేగ వారల తల్లులు రాగ నిన్నె
మెచ్చి వెనకవైచుకొనుచు వచ్చియుందు.
అయిదు వత్సరములు నిండెననుచు నిన్ను
బడిని వేయించి నీవైదు బరులునంత
వరుసఁ జెప్పంగ విద్యలు వచ్చునంచుఁ
బొగడుకొంచును నెంతయు మురిసియుందు.
బంధుజను లెవ్వరేనియు వచ్చి యెలమి
నమ్మ! నీ కొమరుండేడి యనుచు నడుగ
నడుగొ! వచ్చెడు నాతఁడె యనుచు నిన్నుఁ
జోద్యముగఁ గొడుకంచును జూపియుందు.
శైశవమ! నీదు భాగ్యపరిశస్తి పొగడఁ
జాలనుగ నీవు మిక్కిలి సమ్మెదమున
నమ్మనే యమ్మ యనుచును నాడుకొంటి
వమ్మ చేతనే పెఱిగితి వనవరతము.

శైశవము! యేమి యెఱుఁగని శైశవంబు!
ఆవు చనెద వటం చమ్మ యేగ నొక్కొ
అమ్మ దివి కేగుచుండెనే యని తలంచి
యావు విడనాడి యేగితో యెఱుఁగ నేర. *

## 19 ఆకాశదీపము.

ఎంచి తెప్పించి నిలిపిన యెత్తుపోక
తుట్టతుద బరణి మినుకుదోఁప వెలుగు
చున్న యాకాశ దీపంబు నెన్నుకొలఁది
హృదయమా! యెట్టి యూహ వహించుచుంటి!
మనుజుఁ డవ్విధినే కద తనయశఃప్ర
కాశ పుంజంబు నెసఁగించి గర్వపడెను.
సుంత యోజింప దస్థిరసుస్థిరములు
నిలుచునో నిలువదో యని తలఁచఁబోఁడు
అయిన నాదీప మెవ్విధి నలయసంఖ్య
తారకావళి క్రింద స్వధర క్షయుక్తిఁ
దిరుగుచున్నదో గిరగిరఁ దేజమెసఁగ. *

## 20 ఊరకే యింతయిటు పొలమారనేల?

వేయి నెలల భారంబెల్ల వీపుమీఁద
మోసికొనుటను వంగిన ముసలి "ఆయ"

భోజనము తృప్తిగాఁ జేసి పొంకుగాను
తనదు ప్రపంచముపైని దట్టమైన
దుప్పటిని గప్పుకొనుచుండ కొండగీడు
మనుమఁ డొక్కఁడు కొడుకు దానునుచుఁ జేరి
పద్దెమో కీర్తనమొ చక్కఁ బాడుమన్న
వాని కేమని సమ్మతికిని నేను దట్ట
నడుగుచుండెనో ననుగూర్చి యధిక ప్రేమ:
చిన్నతనమందె దయతోడఁ జేరదీసి
విద్య చెప్పించి మా యభివృద్ధి నెంచు
పూర్వపమ్మమ్మ యొంటిగ భోజనంబు
చేసి వెంటనే కంచముల్ దీసికొనుచు
దవ్వులను నుంటి ననుచును దలచు నెదను
దలఁచుచుండెనో ననుగూర్చి వెలమి కుమర.
పగటిపూటెల్ల యెండను వానఁ దిరిగి
పైరులను, దూడదుడుకుల, పాలివాండ్రఁ
జూచుకొని చీఁకటిని గడు సుక్కివచ్చు
ముగుదు పుత్రులకును నీట భోజ్యములను
వడ్డన మొనర్చుచుండి మా బామ్మ మాకు
పట్టు వాసంబులందుఁటఁ బంస్తు పాలు
జున్ను మీఁగడ నేయియు వెన్న మిగులఁ
జిక్కవంచును సెలవుల నొక్కమాఱు

వత్తురాయుంచు మక్కువ వారితోడ
నెంచుచుండెనో నను గూర్చి యెక్కువగను:
పిల్లలెల్లఱ కన్నంబు పెట్టివైచి
విభులరాకల కోపిక వేచియుండి
తమ్మ విడిచిన వెనుక నుత్తరము నంప
నైతిననుచుఁ బెత్తల్లి మేనత్తలెల్ల
యరయుచుండిరో నాక్షేమమాది వార్త.
చనువు మొదలిడు ముందుగ మునుము గదుర
నఖిల విషయముల్ ముచ్చట నాడుకొనుచు
మేనమామలు తమ్ములు నేను మున్న
వారిలో నొక్కఁడనె యని భావనంబు
సేయుచుండిరో ననుగూర్చి చెలిమి యెసఁగ.
అచ్చటచ్చట పనులను సంది కొత్త
చిన్న కాపురముల శ్రీకఁ జేసికొనుచు
నను గుఱించెలు ప్పెట్టుచుండెనో యనుచు నన్న
బ్రాణమిత్రులెంచిరో యనురాగమునను:
వీథియరుగులపైఁ గూడి వింతవింత
ఘోషలను బొర్లిపుచ్చుచుఁ గొంతసేపు
భావమందున మాయూరివారలెవరొ
నాదు పేరెంచుచుండిరో మోదమునను;
కానిచో నాకు భజియించు కాలమందు

నూరకే యింతయిటు పొలమారనేల ? *

## 21 గోదావరి వరద.

గిరులనుచు వనములనుచున్
జఱియనుచును దరువులనుచు జంకక యేటే
టరుదెంచుచుండు గోదా
వరి! నిన్నుం బ్రస్తుతింప వశమే మాకున్. *
ఇసుక తిన్నెలతోడ నెసఁగుచునుండు నీ
వీదరి కాదరి కేకమైతి;
ఒకచిన్న కోలఁ(కట్టు లోప్పుచుండెదు నీవు
తరియింపఁ జాలని ధుణిణివైతి,
చలన మించుక లేక యలరుచునుండు నీ
వాపజాలని ప్రవాహంబవైతి,
స్వల్పనీరముతోడ వరలుచుండెదు నీవు
వర్ణనాతీతాంబు పూర్ణవైతి,
వరయుటకు నెంతొ సామాన్యమైన నీవు
సృష్టిలోపలఁ గనఁదగు చిత్రమైతి,
వహావా! నిర్జీవమై తోఁచునట్టి నీవు
సకల సత్వయుతంబగు శక్తివైతి. *
నురువులు గొట్టుకొంచును వినూతనశక్తిని నెల్ల చూపుచున్
గిరటమలం గలంగుచును గ్రోలుచు నొక్కవిధంబునన్ వడిన్

మేఱకని పల్లమంచును గణింపక పెల్లువయాచు వచ్చు నీ
వఱదను జూడమాకుఁగను బండువయయ్యెడుఁ దల్లి! గౌతమీ! *

వ్యవసాయములు లేని వంధ్య భూముల కైన
పసగలిగించెడు నసలుతోఁడ,
ఎండిపోవుచునున్న సెట్టి సస్యము నైన
ఫలియింపఁ జేసెడు జలముతోఁడ,
పడిపోవుచున్నట్టి పాడు గృహమునైన
ఘనభవన మొనర్చు కలవతోఁడ,
నడువ లేకుండెడు నాకలనైనను
బరువెత్తఁ జేసెడు వాలుతోఁడ,
కరము మూర్ఖత నుండెడు నరున కైన
కౌతుకంబెసఁ గొల్పెడు గతులతోఁడ,
మాకుఁ బ్రిత్యక్షమగునట్టి మాన్యతటిని!
పలుకఁ దగుఁగద నినుఁ "గల్పవల్లి" యనుచు. *

ఎటో నాసికకడఁ బుట్టియు
నిట నీ సామర్థ్యమెల్ల నేర్పడు టతయున్
దిటముగఁ బరోపకారం
బెటనైన జలుప దగునని యెంతయుఁ జాటున్. *

## 22 పంటకాలము.

సందర్శించితిఁ గడుపని

తొండఱులోఁ జేనికోతఁగో నుండుచు వెఁ
ముందును బరిశీలించుచు
నందందలి రాలికలను నరసెడు నార్యుఁ. *
మఁదుసలిహాళికోత్తముఁడుపూర్వుఁడు దార్ఢ్యముమీఱనింకఁదా
వదలక చేతికర్రి తొడి భాసిలనూనుచు నుత్తరీయమ్ము
దుదలు వెనుం భజింపఁజెవిదొప్పలఁ గాయఁదువాలుచుట్టుకొం
చెదురు వడెఁ మదధ్వమున నేఁజనుచుండు విహారవేళఁ. *
పండిన వెన్నుభారమునఁ బండినపంటను మాలకూలిస్త్రీ
లెండకు ముందుఁ జేకొడవలెంతొ ధగద్ధగలాడఁ గోయ నా
యండను గొంతసేపు, నటుపైఁ బన కట్టిలఁగట్టి మోయ నా
యండను గొంతసేపు, నటుపై నొకచోటను గుప్పవేయ నా
యండను గొంతసేపు పదిలమ్ముగజూచుచు నాకుఁ జూపుచుఁ
నిండు వయస్సి యాయయ కనీసము నింతగునంచు నంచనా
కొండొకఁడన్నఁగాదనుచుఁగొంతననుఁ దనిఖించెఁబల్కులస్ *
రయితులుగానుపించునెడ "రాయని" ఓయియటంచుఁబిల్చుచు
న్నయినదెమీకుఁగోతయని,యమ్మది బాగుగపండెనంచు, నీ
నయితివి సొమ్మటంచు, నికనందునవేతువె దాళువా యటం
చయినవి కానివెన్నొ విసుగన్నది లే కొకవృత్తినాడెబో. *
అల్లన మందహాసినయి యార్యవతంసుడ! డెబ్బదేండ్లపైఁ
జెల్లిన నింక మీరలు గృశింపక యిచ్చట నిచ్చనివ్విధిఁ
వెళ్ళఁగ బుచ్చుచుండిరల వృద్ధవయస్సున, శాంతియెన్నఁడో

మళ్లట లెన్నఁడో యనిన మార్గముఁ బ్రక్కనుజూపి నన్ననున్*
కంటే బూడిద యెముక్కక
మంటిని నైక్యంబులగుచు మానవదేహాల్
గంటికిఁ గనఁ బడకుండఁగ
నంటుకుచో రుద్రభూమి యట స్థిరపడియెన్. *
ఆయుష్షు పిల్చుదాఁక నిసుమంత విరాగము శాంతి సున్న, నే
నీయెడఁ బుట్టితిన్ బెఱిగితిన్ గరిణీకముఁ జేసితి నేబదేండ్లు స
స్యాయత భూమిగొంటిని, పరార్థముపైని నపేక్షలేదు, నా
కాయువుగల్గుదాఁక నిక నయ్యెడి దెయ్యదియైన నిట్టులే." *
తత్త్వము వచియించిరనఁ
దత్త్వంబున కేమియుంచు ధారుణిఁగల యా
సత్త్వవిహీనపు వరినిఁ
సత్వరముగఁ దీసిపలికె సాటనగ నోహాహా.
విత్తనము పడియె నిచ్చట
వృత్తిని నదపెఱిగి మోసులెత్తుక యీనెన్
రిత్తంగ బోకది పండుచు
నిత్తఱినే పడి నశింపదే యీ భూమిన్. *
ఇఁక బలుకంగనేమి గలదింపుగఁ బంటవలంతి, గూండ్లలోఁ
గకవిక పక్షులన్ జొనిపె గాటపుజీఁకటి వృక్ష పఙ్క్తి మూ
సుకొనియెగుబ్రింకెసూర్యుఁడా శుభ్రపతోఁ గనువిచ్చుపోలికన్
నోకటొకటే యుడల్ వాడిచె నుత్తమనిశ్చలకాంతులీనుచున్*

## 23 వసంతాగమము.

ఏమీచూడఁగఁ జోద్యమయ్యెడుఁగదాయీగాలి చల్లంగఁ దా
నామోదం బెసఁగంగ గంధవహుఁడై యంబోధిపైనుండి నేఁ
డేమేమో శుభవార్తలన్ దెలుపఁగా నీదిక్కునన్ వచ్చెడిన్!
సామీ! సాధువసంతురాక మనకున్ జాటంగ దావీచెనున్.*

తమ గానరసమును దరులెల్ల జిమ్మెదు
పికము లెవ్వాని గాయక గణంబు,
మృదు పత్రములచేత ముదమైన లేఁగొమ్మ
లెవనికి వీవన లవిరళముగ,
మల్లెలాదిగగల వల్లికాతతులు క్రొం
బూవుల నెవ్వాని బూజసేయు,
చల్లగాలిని వెదజల్లెడు జలసీమ
లెవనికి విహరించు నిరవులు భువి,
రాకపోతె నెవని రాకచ్చు సంతోష
మెవని రాజ్యమందు నింపుగులుక
సృష్టిజాలమెల్ల చిత్రింబుగానుండు
నల వసంతునకును నంజలిడుదు. *

మలయమారుతమున్న "నైదాన" మూలమునను
ప్రాసాద భవనాలు వనికిరావు
పండిన మాకంద పనస ఫలంబులు

భక్ష్యభోజ్యంబుల భళిర! మించు
పికముల స్వరములు శుకభాషణంబులు
వీణకంటెను వినవిందుసేయు,
వేడ్కతో ధవళంపు వెన్నెలఁ బవళింప
పరుపులు పాన్పులు మఱపువచ్చు,
బీదలును భాగ్యవంతులు వేఱులేక
వసుధ జనులెల్ల సంతోషవంతులగుచు
దేవదేవుని నవ్యయు సేవఁజేసెఁ
సలుపుదురు వేడ్కలెన్నొ వసంతవేళ*

## 24 జనజనపద సౌఖ్యసంచారములు.

కొండగాలి చెవులఁ గొట్టెడునే యని
ముందు మిద్దె తలుపుమూసి లోన
గాఢనిద్రి జొక్కి కదలకింకను వెచ్చఁ
బండుకొనఁగ జూచువారలేమొ *
సోదరులార! లెండు! పరిశుభ్రిరుచిన్ దెలవాఱుచుండె, శు
క్రోదయ శోభ నెంచి తొలికోడికుతమ్ము గణించి బామ్మ పం
చాదిని గవ్వముల్ జిలికి చల్లను వెన్నను జేయుచుండె న
త్యాదరలీల గీతికలనక్కటి వెన్నుని మేలు కొల్పుచున్. *
మొదవుల కొట్టంబున బాల్
పిదుకుచు లేగలను వదలఁ బేరాసవడిన్

. బొదుగుల నయ్యావి కుడిచెడు
నదరున నోనఁగూర్చు రవళి నటుతో మువ్వల్. *
పుంతచింతల పొదుగు శకుంతతతులు
కలకలమటంచు గూండ్లను వెలుతురెంచి
రెక్కల విదల్చి యెగురు శే పక్కికనుచు
సాంధ్యభాగ్యోదయాశయోజనము సేయు. *
మలతలపై నెసంగు పొగమంచు ముసుం గెడలించి చల్లనౌ
జలముల నోలలాడు జలజంపుముసుం గుడిగించి నిండు పం
టలఁబడి జాఱువాఱు తుహినంపు బెడం గడగించి భానుమం
డల కిరణారుణఁ ప్రభ వనంబున సొంపును బెంపు నింపెడున్. *
ఇంత వేకువ నెవరు వచ్చిరి ఎడసియుండెడు వనద్వారము
ఎంతొ ముందుగ మనము లేచితిమే యటంచును దలచినారము
పడిన ఫలములుపూలువడయఁగ బసులులోపలదూఱియుండురు
అడుగడగు నిదురించుమాలిని ఆగుమాగుము పలుకు వింపురు,
ఏరుగారుర నాన్నగారెర యింకఁ దోట నెచూచుచుందుర
ఆరయుమియదె గరువువైపున కరుగుచుండిరి మనకు సందుర
కాశిరేగీయేమ ఘనముగఁ గాసియుండును పెద్దపండ్లను
రాశిరాశిగఁ జెట్టుకిందను రాలియుండును నె? అబ్బ! ముండ్లను
దొక్కినాఁడను, నాకుదొఱకెను, దొడ్డపండుర, నాకునీయుమి,
లెక్కపెట్టవు సీదు పండ్లను, లేత యొగరుర, యొకటి తీయుమి,
ముట్టుకొనకుడి చెట్టకొమ్మల మూలనదిగో యొక్కటుండెర,

కొట్టిచూడుమి, నీవుతీయుమి,కొఱకబోకుమి, మంచి పండేర"*
అనుచున్ శేని ఫలమ్ము లేరికొని యందందొప్పు నారింజ కొ
మ్మ్రనటుల్ దాడిమదబ్బనిమ్మపనసల్ మామిళ్ళ మేలెంచుచున్
గనసౌ తీవెల పూలచా లిపు డుషఃకాలా నిలోత్పుల్లమై
ఘన సౌవర్ణముతోడ సౌరభముతోఁ గావించు సింగారముల్ *
ఉంతుమా! యిది యప్టైతెప్రింతుమా పూరాఃశి
తెప్రింతు మియ్యది యిష్టైవృంత మెడఁయు
దాతుమా! యిది పాఱవేతుమా కడులేఁత
దాతు మియ్యది శేనిఁ దావి ముదురు
పంతుమా సరము గూర్చింతుమా యపరంజి
పంతు మియ్యది వేలువడనఁ బ్రిబలు
కోతుమా చెట్టునే చూతుమాంవిడుపూనె
చూతు మియ్యది నిప్పి సొబఁగు మీఱు
నని విమర్శించుచు గులాబి నల్లి చంప
కమ్ము చామంతి బంతిపూన్ కైకొనుచుమఁ
దలను గొబ్బరిపోక పొత్తులను జివి
నిలుచు హిమజలంబులవలి తెలియ నగును. *
తలపాగ కిర్రుచెప్పులు లగ నవరించి
యూతగాఁ జేగర్రునూని నిలిచి
పలుమాఱు నలుగడల్ దిలకించి యుపు డప్పు
డట్టె కూలిని గనిపెట్టి చూచి

పనిచేయ వేమని యనఁ బోయి యాగుచు
నెట్టెట్టొ పాలేరు నెచ్చఱించి
పాలిచ్చెచినవారు పశె దూడలనుచును
గట్టిగ లేని జాగ్రత్త నెఱపి,
కుప్పనూర్పుడుకడఁ జేన్కోతకడను
నల్ల వ్యవసాయమెల్ల మీావల్లనయెడు
నని తలంచుచు దినము స్వేచ్ఛను జెలఁగి
వెలయఁ జేతురు తండ్రిల వృత్తిమీాఱు. *

ఎండ యొకింత హెచ్చినను నెంచరు కొండలయండ నిల్వగా;
నుండు శ్రీమన్ దలఁపరట నోపిక సేవకు లొందుచుండగా;
తిండికి వేళ నేరువరు తీయని దుంపలఁ దేనెలాను చా
యంశనె గర్వి పచ్చికలఁ దన్వి మెలంగెడువాల నెంచుదో.*

సెలవు దినముల కలిమిని జాలదనక
నలవడిన మచ్చు సార్థకమగు విధాన
మీారలో సహోదరులార! చూఱగొనుడు
జన్మ జనపద సౌఖ్యసంచారములను. *

## 25 కపోతద్వయము.

నిర్మలోదకముల నీలాంబుజంబులఁ
దీరైన కాసారతీరమునను,
నరుణ పల్లవములఁ బరిపక్వ ఫలముల

సౌఖ్యమీను రసాల శాఖలందుఁ
జతురతతో నొక చల్లని యూలయుం
బొక పక్షి నిర్మించె, నొప్పమీఱ
నందు వాసముసేయు నందముగా జోడు
గువ్వలు నెయ్యంపుఁ గూర్మిఁ గదుర
నవియు నొండింటి వీడక యచ్చటచట
దిరుగుచుండెను నాహార తీర్థములకు
జేరుచుండెను గూటిని శీఘ్రముగను
సూర్యుఁ డపరవారిధి నస్తె సొచ్చుసరికి. *
పరిసరభూముల వరినేఱి యిలుసేరు
నొప్పుగా నాపక్షు లొక్కనాఁడు;
వన్యసీమలఁగల స్వాదుఫలంబుల
మెక్కుచుఁ దిరుగు వేఱొక్కనాఁడు;
కుసుమ యుతంబగు కుంజంబు చెంగట
విహరించునవి రెండు వేఱొక్క నేఁడు;
తలిరుటాకుల సెజ్జఁ దమ కులాయంబున
నోజమై గడుపు మఱొక్కనాఁడు
ఇట్లు సతతంబు హాయిగాఁ జెట్టులపొడ,
చల్లగా గాలివీచెడు సరసులకడ,
బున్నమినిగాయు నిండైన వెన్నెలయెడఁ
దనరునట్టిది యాకపోతద్వయంబు. *

ఇంపొంది కొన్ని దినములు
పెంపెసఁగుచు నెల్లు గడుప విహగంబులకున్
సొంపగు వసంతఋతువును
బంపెను గరుణామయుండు బరమేశ్వరుఁడున్.
ఒక వేసఁగి దివసంబున
సకలంబును వేఁడితోఁప సంతాపముచే
నొకపరి నిటు రమ్మాయని
సకియను మగ గువ్వ పిలచి సన్నగఁ బలికెన్! *
కమలముఖి! నేఁడు కమలాప్తుఁ డదియేమొ
చండతరంబుగా నొకగాయు,
గంధేభగామినీ! గంధవహుండేమొ
చిచ్చు గాడుపు చేటఁ బెంగువాఁడు,
తోయజాక్షి! చూడు తోయంబులన్నియుఁ
గాచినట్లుగ వెచ్చగళ పెళమను,
నరుణ పల్లవపాణి! ధరణి దేవి యిదేమొ
వహ్ని దేవునకును వశ్యయయ్యె,
కాన నాతోడ రాకుము చాన నేఁడు
కొమ్మలందున్న చిట్టిగేహమ్మునందు
నిలువుమీ! దారి వడగొట్టు నీరు దొఱక
దబల సుకుమారి వీవు బిట్టలసిపోదు. *
ఇంట నిన్ను విడువ నొంటరి వోదువు,

మనసు రాదు నాకు మన మేడ పడ
నేను గదలకున్న మన మిత్రులము గూడ
నాకలికిని గలికి! యోగలేము. *
కాన వేగమె తెత్తును తనివిదీఱ
మంచి ఫలముల నేనెంతో యెంచిచూచి,
శీఘ్రమే వచ్చువాఁడను చెలియ! నమ్ము
మనిన నాథునితోఁ బల్కెనంత నతివ. *
పతి యుండనున్న సతికిన్
సతతము గష్టముల వెల్ల సౌఖ్యములె యగున్
గతివేఱు మానవతికిన్
క్షితిపైఁ గలుగంగఁ బోదు ఖేచరవర్యా!
ఉద్యాన వనముల నొప్పు చుండెను సీత
రాముతో వనముల బాముబడెను;
సుమ శయ్యనే కాని సుగమెఱుంగనిదమ్య
నలురాణి చెందెను సిలుగు లెన్నొ;
నిండు జవ్వనమున నెగడెను సావిత్రి
భర్తకై పడరాని పాట్లు పడెను,
చక్రవర్తినియైన చంద్రమతీదేవి
చాల నవసె హరిశ్చంద్రుతోడ,
కాంతలకు దుస్తరంబగు కష్టవార్ధి
దాట క్షమయను నావతో దారిఁ జూపు

నాథుడందున చుక్కాని నడుపుచుండు
దైవకృపయను గాలివే దరికిఁ జేర్చు. *
కాని మీయాన నే దాటుదానగాను
భయములేకుండ నుందు నిలయమునందు:
శీఘ్రముగ రండు మీరు నాచెంతలేని
నిమిష మొకయేడుగాఁ దోచునేఁడు నాథ! *
తన చెలి పల్కులన్ విని పతంగవరుండును జాలహర్షము
న్మనమునఁ జెంది ముద్దుగొనె నాతియునవ్వి మనోహరుండ! కా
ననముల నాగబోకుమిట నాథను దోపదటంచు వేఁడె, "ఓ
వనరుహనేత్రి! వచ్చెద నవశ్యము నమ్ముమటంచు; భర్తతా*
పాదములు రెండు నొక కొమ్మపయిని నూది
ప్రాణసఖివైపుఁ నొకసారి బఱపె దృష్టి;
యంతఁ బక్షద్వయంబు శకుంతవరుఁడు
విప్పి యెగిరెను నాకాశ వీథులందు. *
అనుపమ పక్షవేగమున నంబర మార్గముబట్టి పోవు నా
థుని దెసఁ జూచిచూచి మదిఁ దోయజనేత్రితలంచెనిట్లు మా
నిని పతిపీడియుంట యవనింగడు దుర్భరమమ్మ! వచ్చునో
వనములఁ జిత్రముల్ గనుచు వచ్చుటమానునొ సత్వరంబుగా*
ఉరుతర గిరులన్ దాటెన్
సరసుల వీక్షించె నెంతొ సంతోషముతోన్
సరగున వనములు సేరెన్

విరివిగ ఫలములను గోసె విహంగ గోత్రమునున్. *
అంతలో నెఱ్ఱని కాంతి నొప్పుచు సాంధ్య
భానుండు గ్రుంకెను బశ్చిమమున,
గోగణంబుల నెల్ల గోపబాలకులెంతొ
వేడ్కతో మఱలించు వేళయయ్యె
పాఠశాలలఁ జదివి బాలురు వీథుల
గంతులు వైచెడు కాలమయ్యె,
దినమెల్ల స్వేచ్ఛగా దిరిగి శకుంతము
ల్వడి గూండ్ల ప్రాంతకు వచ్చుచుండె:
ఉవిద యొంటరిగా నింటనుండెఁ గాన
సత్వరంబుగఁ జేరుము సతిని నేఁడ
టంచు మదిని దాఁ దలపోసి యతిరయమునఁ
బోవుచుండెను మఱలి కపోతరాజు. *
అతిరయమునఁ దా నెగురుచు
సతికిన్దనరాకఁ దెలుప సంతసమునఁ బ
ర్వతములు చెఱువులు వనముల్
బ్రతిఘోషింపఁగఁ గపోతవరుఁ డాగిఁ గూసెన్. *
తనదు రాకను జూచియుఁ దరుణి యేల
యెదురు రాదంచు వింతచే మదిని దలచె
"చుట్టముల జూడఁ బోయెనో చుట్టుపట్టు
దిరుగుచుండెనో యలసి నిద్రించు నొక్కొ"

కాంతుఁడు గులాయ మంతటఁ గలయఁ జూచి
జోటిఁ గానక నిప్పు డెచ్చోటకు బోదు
నంధకారంబు గాఢమై యలముకొనియె
ననుచు విలపింపఁ దొడఁగె నయ్యతివ గూర్చి. *

నెచ్చెలి యెన్నఁడుండదు పనేమియులేక పరస్థలంబులన్
వచ్చెడి వేళదాటె నిఁకవచ్చునె చిక్కెనో బేలయాట నే
యిచ్చునదైన నయ్యొ యెటులూఱటఁ జెందుదునామనంబు ని
మ్మచ్చునఁ దల్లడిల్లఁ జెలి మమ్మిటు వీడఁగ నీకు న్యాయమే? *

మెఱపు తీగలేని మేఘంబు పగిదిని
రేవెలుఁగులేని రేయివోలె
దీపకలికలేని దీపగృహము మాడ్కి
కాంత లేమి గూడు కాంతిఁ బాసె. *

సురవరులార! భూసురులార! తెలుపరే
నారీమణిని నేను జేరు విధము,
గిరులార! నదులార! తరులార! చెప్పరే
యింతియే త్రోవను నేగినదియు,
శుకవంతసములార! పికములా? చూపరే
చెలియ యేచోటును చేరినదియు,
లతలార! వన్యదేవతలార! కంటిరే
పొలఁతి యేపుంతను బోయినదియు,
అకట! వెర్రినై పీకల నడుగుచుంటి.

నాకు దిక్కెవ్వరింక నే నరుగు టెట్లు?
అరుగుచోఁ బ్రాణసఖి నెటు నరయువాఁడ?
గాఢమై యంధకారంబు గడలుకొనఁగ." *
అంతఁ దూర్పుదిశను నాకాశవీథిని
జంద్రబింబ మెంతొ చక్కగాను
కాంతు లీనుచుంటఁ గాంచి కపోతమ్ము
పడఁతిని వెదుకంగఁ బయనమయ్యె. *
నారామ యీసుంద రారామమందుండు
ననుచుఁ దా వెదకును వనములు గట!
నా లతాంగి సతతమీలత నతిసేయు
ననుచు దాఁ బరికించు నతివ కొఱకు,
నాపల్లవాధర యీపల్లవద్రుమ
మందు నివసించు నా యనుచు జొచ్చు,
నా సుమగాత్రి నీ శ్రీసుమయుతముతో
తరులఁ జూచెదనని తలఁచు నేగు,
ఇట్లు వికలమతి యగుచు నింతి జాడ
తెలియ నేరక నలుదిశల్కలయ జూచి
యలసితన ప్రాణ సఖిమీద నాశవీడి
విశ్రమించెను చెట్టుపై విహగవరుఁడు *
అంతఁ గ్రిందకుఁ జూడంగ వింతఁదోఁపఁ
జిక్కువడియున్న తెక్కల పక్కనొక్క

శూలమునఁ పతంగంబొండు సొమ్మ సిల్లి
ధరను బడియుంటఁ గాంచి తాసరగున ది.రి. *
అది తన బోటిగా నెంచి యాసయుఁదోపఁగఁ జూచిసూచి యు
ల్లదె మృతినొందె నయ్యో తరళాక్షి యటంచు విషాదమగ్నుఁడై
వదనము వాల్చి మూర్ఛనడి పక్షి వతంసుఁడు జాలకాలముకె
మదిఁ జెలిఁగూర్చి దుఃఖపడె మానిని కట్టియవస్థ కల్గుటన్*
తరుశాఖశిఖలపైఁ దనరెడు తరుణి నే
డీధరాతలమున బాధనొందె,
అలరు పాన్పునఁ బండు నలరుఁ బోఁడియు నేఁడు
కటికరాలను జెందెఁ గష్టములను,
విరిశరంబు సహింప నెఱుగని రమణిపై
నీశర మే కూర్చెఁడేసె నోకొ,
తనగూఁడు దాఁటని తన్వి నేఁ డదియేమొ
యింత వవ్వక్కట యేగుదెంచె,
నన్నుబాసి యెపుడు నాతి యుండెఱుఁగదు
నేఁడు బేలనగుచు వీడితిఁ గట
నీకు నాకు ఋణము నేటితోఁ దీఱెను
ప్రేమబంధమింక వీడిపోయె. *
వనములకు వచ్చిన వనిత వనటనొందు
ననుచు నింటనే విడువగా నమ్మచేత
నిలను గూలెను తా నొండు దలప దైవ

మయ్యో! వేఱుదలచు నన్నయది నిజంబు. *
గృహకృత్యములయందు గృహిణి తా మెలఁగును
ననయంబు దక్షిణ హస్తమగుచు,
వనవిహారములందు వనిత తా సల్లాప
ములనాడు వేడ్క నెచ్చెలిగ నగుచు,
కలసి కూటిని జేర నతివతా భక్తితో
జరియించు పడిఁ బరిచారికగుచు,
మది నధైర్యముపుట్ట మదవతి యుత్సాహ
మును గూర్చు నాప్తుని బోలునదయి,
కాంత సతతంబు సాహాయ్య కర్త్రియగుచు
జీవయాత్రను నడుపంగ నావయగుచు
నొప్పుచుండెడి దెంతలో నిప్పుడకట
వనిత తాఁ బాసెఁ బుడిమిపైఁ బ్రాణములను. *
తరువుల్మాకిరవుల్ సదా ఫలములాధారంబు లాకొన్న, నీ
సరసుల్దాహమడంచు, మారుతము మాసంతాపముం దీర్చు, నె
వ్వరికిన్ హానినొనర్ప బోమకట! యేపాపాత్ముఁడో క్రూరుఁడై
చెఱుపున్ జేసెను మాకు నీశ్వరుఁడ దాక్షిణ్యంబునన్ జూడవే*
మంచిచెడ్డలు దురాత్ముఁ డెంచునె మది
హానిజేయంగ వానికి నాశతీఱు
కఱువదే విషసర్ప మకారణముగ
సాధులును దుష్టులనెడి సంశయములేక.

ఆది మధ్యాంత రహితుఁడ యాదిమూర్తి!
సర్వలోకైక నాథుఁడ! సత్యరూప!
దీనరక్షక! నీవె నాదిక్కు చూవె
కావుమీ జతఁ గోల్పోతిఁ గరుణతోడ."
ఇటుల పక్షి వతంసుఁడా యింతికొఱకు
ఖేదపడుచుండ నొక్క యోగీశ్వరుండు
ఆదిదేవుని పొగడుచు నాదరమున
దరికిఁ జనుదెంచి పలికె సంతసము మెఱయ. *
ఏలా జేలగ గోడుగోడుమని నీవీరీతి దుంఖింతు, నీ!
యాలా గేడ్చుటమేలె? జీవులిల నాయూజన్మముల్పొందును
నీ్లోకంబున నాటకులపగిది నీయీ చర్యలన్ జల్పుచున్
నాలోకింపఁగనెక్కడో యెపుడో దేహాలూాష్తృనస్త్రిలటుల్ *
చదలఁ గూడుచువడిఁ బాయు జలధరంబు
లట్లి ధరఁ్శిపై దారసుతాదులెల్ల
కలసి విడిపోవుచుందురు గాదె దీని
కింత వగవనేటికి నో శకుంతవర్య!
వర్షధారతోఁ బిడుగులు పడెడు భంగి
నల గులాబికిఁ గంటక మలమినట్లు
రత్నములలోనఁ గలసిన రాళ్ళభాతి
సుఖములందును గష్టముల్ సొచ్చియుండు.
గ్రీష్మమును వర్షము లనుసరించు పగిది

నిశల వెనువెంట దివసులు నెగడు కరణి
కష్టముల వెంట సుఖములు గలుగుచుండు
కాన( బురుషుఁడు ధృతిఁ దలఁగంగరాదు. *
ఆర్తరక్షకమణియాది మూర్తియగుచు
సకలకర్త హర్త సర్వభర్త
దీనుల వడినేలు దేవుఁడు చెండాడుఁ
బాపుల నవి నీతి వర్తనులను. *
చలిని గూల్చిన క్రూరుఁడా చెట్టుచెంత
సర్పదష్టుఁడై మృతినొందె సాధుజనుల
చెఱుపఁ జూచెడు దుష్టుడు చెడడె తుదకు
నింద్యుడగుగాదె హింసను నెరపువాఁడు.
భూతదయ నెల్ల ధర్మముల్ పొందుపడును
భూతదయచేత మనుజుఁడు పుణ్యుఁ డగును
భూతదయ కీర్తి నిచ్చెడు భూషణంబు
భూతదయ లేని పురుషుండు పుట్టుచేటు. *
ఈదైన్యంబును వీడుమా చెలి శరంబేయంగ మూర్ఛిల్లె నం
తే-దారః బ్రతికింతు నీవు గన-మీ నెయ్యంబు మీనీతి మీ
యౌదార్యంబును మీ వినోదమును మీ యానందముఁ దుష్టియుం
మీ దాంపత్యము మెచ్చినాఁడ ధరపై మీ పేరు వర్థిల్లెడున్.*
నిత్యమౌ నానంద మత్యంత మిచ్చెడు
పరమేశు సాన్నిధ్యపదము గూర్చి,

కామలోభక్రోధ కంటకయుతమగు
నీలోకయాత్రను నెసఁగఁ జేయ
సంసార శకటంబు సమకూర్చె దైవంబు
ధర్మమార్గంబును దప్పకుండ
సతియు బతియు సహాయతి కష్టములు వడి
దాని లాగుచును ముదంబు గాంత్రు
కనుక దంపతు లేకమౌ మనసుతోడ
కలహములు మాని యొండొరుల్ గలసి మెలసి
ధరణిపై ప్రేమబంధులై తనరిరేని
సులభమగుఁగాదె పయనంబు సుఖతరమయి. *
అని పల్కి యోగివరుఁడును
వనములగల నొక్కదివ్య వనమూలిక నా
నన గొన ముకు కడ నుంచెను
వనితయు వడి మూర్ఛదేఱఁ బతి ముదమొందెన్. *
అంత దంపతు లిరువురు సంతసమున
దీసగాఁ గృతజ్ఞతయెల్ల దెలియునట్లు
తమకు జీవంబు లిచ్చిన తాపసునకు
భక్తితో శిరములు వంచి పలికిరిట్లు. *
తాపసోత్తమ నీ దయారసధారలన్ బడి ఘోర సం
తాపము ల్గడతేఱె మిమ్ము సదా మదిన్ స్మరియింతు మో
పాపహారుఁడ! మమ్ము నిద్దఱ బాయకుండఁగ జేసి తీవ్

దాపుజేరి యిదే యొనర్తుము దండము ల్గయికోఁ దయన్. *

మనుజులు భూతదయాపరులై భువిమాన్యులుగావలె నెల్లపుడున్
జనవతి ధర్మపథంబును దప్పక సర్వశరణ్యుని గొల్వవలెన్:
అనయము దంపతులేకత సౌఖ్యములందగ దివ్యులు మెచ్చవలెన్
అనుపమ సస్యములీనుచు దేశములక్షయసంపదలొందవలెన్ *



ఈకవిచేతనే విరచింపఁబడి యచ్చై వెలకున్నన్ని గ్రంథములు—

| | | | |
|---|---|---|---|
| భావమురళి | 0— 4—0 | (Approved) | 1—0—0 |
| జనపదములు. | 0— 4—0 | | |
| కుమారకంఠము. | 0— 4—0 | (Approved) | |
| మాతృదేశసంకీర్తనము. | 0— 4—0 | | |
| కలరుతము. | 0— 4—0 | | |
| ప్రకృతిచందనము. | 0— 4—C | (Approvєd) | 1—0—0 |
| ఆత్మవ్యక్తి. | 0— 8—0 | (Approved) | |
| నెలబాలుఁడు, వేణువు, శేషఫణితి | 0—12—0 | (Approved) | |
| వివిధకుసుమావళి. | 0—12—0 | (Approved for school use) | 1—0—C |
| ఆగడపలు. | 0—12—0 | | |
| చదువులదుత్త | 0— 4—0 | | 1—C—C |
| చిట్టికైత | 0— 6—0 | | |
| పొట్టికత. | 0— 8—0 | | |

వలసినచో:—కవికొండల వెంకటరావుగారు, నరసాపురము, పశ్చిమ గోదావరి అని వ్రాయనగు.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 8 | 18 | చుండనే | చుండెనే |
| 17 | 21 | గారమీయ | గారవమీయ |
| 32 | 7 | సంతటర్ణ | సంతటన్ |
| 32 | 20 | పసిమిపై | పసిమిమై |
| 34 | 2 | బొడిచె | వొడిచె |
| 35 | 4 | బాటిలు | వాటిలం |
| 71. | 19 | వారలెవరొ | వారలెవరు |